# అందము, ఆనందముకొరకు

ప్రఖ్యాత "ఉమా" బ్రాండు బంగారు కవరింగు నగలనే కొనండి. బంగారు కవరింగు "ఉమా" లాకెటు చైన్లను స్త్రీ, పురుషులకు, బాల, బాలికలకు ఉపయోగించుకొనండి. అనేక సంవత్సరములు మన్నిక యుండి తృప్తినిచ్చును.

సామాన్య వి. పి. పార్సెలు చార్జీ రు. 1-37

## ఉమా గోల్డు కవరింగు వర్క్సు

హెడ్డాఫీసు: ఉమామహల్, మచిలీపట్టణము

ఉమా గోల్డు కవరింగు వర్క్సు పోష్టాఫీసు




మా విక్రయశాలలు:

| | | |
|---|---|---|
| 90 - చైనాబజారు రోడ్డు, మద్రాసు - 1 | 581 - శివాలయం వీధి, విజయవాడ | 104 - అవెన్యూ రోడ్డు, బెంగళూరు సిటి |

క్యాటలాగుకు, ఉత్తరప్రత్యుత్తరాలకు హెడ్డాఫీసుకు మాత్రము

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫొటోశీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.

వారి
భవిష్యత్తు
మీ
చేతుల్లో వుంది

తెలివిగల తల్లి తండ్రులు తప్పకుండా సాతే బిస్కట్లనే ఎన్నుకొంటారు.
ఎందుకంటే అవి అతి చక్కని పదార్థాలతో, ఆరోగ్యకరమైన పరిస్థితులలో తయారు చేయబడినవని వారికి తెలుసు. అంతేకాక వారి పిల్లలు, అప్పటికప్పుడే ఫ్యాక్టరీ నుండి వచ్చిన వాటి తాజా తనాన్ని, రుచిని యిష్టపడతారని తెలుసు. ప్రతి రోజూ సాతే బిస్కట్లనివ్వండి..... వారు ఎంత ఆరోగ్యకరంగా, బలంగా పెరుగుతారో చూడండి.

మంచి ఆరోగ్యానికి...
సాతె వారి
బిస్కట్లు యివ్వండి











సాతె బిస్కట్ అండ్ చాకొలెట్ కం. లి., పూనా-2

Heros' 112 TEL






# పాఠకుల లేఖలు

## మే 1961

"జలరాక్షసుడు," "రహస్యం," "కొత్త అమ ల్దారు," "చిత్రకారుల యుక్తి," "భార్యకుతగిన భర్త" చాలా బాగున్నవి.

—వేమూరి శ్రీరామచంద్రమూర్తి, గుంటూరు

"జలరాక్షసుడు," "రహస్యం" కథలు బాగు న్నాయి. "కొయ్యగుర్రం" అప్పుడే ముగిసి నందున నిరుత్సాహం కలిగింది. "భార్యకు తగ్గ భర్త" చదివి పకాలున నవ్వొచ్చింది.

—కే. జి. జయసుజాత, ఇ. తాండ్రపాడు

"జ్వాలాద్వీపం" చదువుతుంటే మా మనస్సు పురకలు వేస్తోంది. "చిత్రకారుల యుక్తి," "మట్టి బండి," "భార్యకుతగిన భర్త," "జలరాక్షసుడు" రచయితలకు మా కృతజ్ఞతలు.

—టి. బాబురావు, హైదరాబాద్

"జ్వాలాద్వీపం," దాసు వాసుల చిత్ర కథలు చాలా బాగున్నాయి. "జలరాక్షసుడు" రచయితకు నా అభినందనలు.

—వి. ఎస్. పోశెట్టి, నిజామాబాద్

మా లైబ్రరీలో వున్న గ్రంథాలన్ని ఒక ఎత్తు, "చందమామ" ఒక ఎత్తు.

—సెక్రెటరీ, శ్రీరామా లైబ్రరీ, అప్పిచర్ల

ఈసారి "చందమామ" చదువుతుంటే ఒకరక మైన ఆనందముగా ఉన్నది. చదివినవే చదువు తున్నాను. ఈ కథలను రచించిన రచయితలకు నా అభివందనములు.

—కాకాణి నిర్మల, అలగానిపాడు

ఈ నెల అట్టమీది బొమ్మ ఆకర్షణీయంగా లేదు. "కొయ్యగుర్రం" ముగించినందుకు చాలా విచారిస్తున్నాం.

—జి. లక్ష్మీ శారద, రాజమండ్రి

"కొత్త అమర్దారు," "జలరాక్షసుడు" చదువుచున్నంతసేపు నవ్వాగింది కాదు. "జ్వాలాద్వీపం" చాలా బాగున్నది. ఏప్రియులు నెల "చందమామ" లోని బొమ్మలు చాల బాగున్నవి.

—ఎస్. అర్. పున్నయ్య, గుడ్లపల్లేరు

"పాపాలకు మూలం" ఈ నెల యుత్తమ కథగా ఎన్నుకో వచ్చును.

—కె. రామచంద్రం, కరీంనగరం

రామాయణం రంగుబొమ్మల సీరియల్‌గా ప్రారంభిస్తామనడంతో వచ్చిన ఆనందం ఎడిటరుగార్ని వేనోళ్ల పొగడిన తీరదు.

—వారణాసి సూర్యారావు, మీనవిల్లూరు

"జ్వాలాద్వీపం" జూన్ సంచికతో ముగుస్తున్నదని విచారిస్తున్నాను.

—తన్నీరు మహాదేవదేశాయి, కంకిపాడు

"బింబ ప్రతిబింబాలు," "పాపాలకు మూలం" అన్న రెండు కథలు నన్నెంతో ఆకర్షించినవి.

—జె. ప్రభాకరరావు, ఒంగోలు

"స్వర్గ నరకాలు," "బింబ ప్రతిబింబాలు," "పాపాలకు మూలం" చాలా బాగున్నవి. స్వామి రామతీర్థగారి కథలు ప్రచురించు చున్నందులకు నా అభినందనలు.

—పిచ్చిక మల్లేశ్వరరావు, మోరి

"చందమామ" మా నాన్నగారు పూర్తిగా చదివిగాని మా కివ్వరు. అది చదువుతుంటే ఎంత ఆనందంగా వుంటుందో చెప్పలేను.

—అక్కల రాజబాబు, గూడూరు (కృష్ణా)

మీరు మీ ఊరిలో మా "చందమామ" అమ్మే చిన్న ఏజంటుగా వుండవచ్చును. దీనికి మీరు మనిఆర్డరు ద్వారా రు. 3-00 పంపిన 8 "చందమామ" కాపీలు మీకు సప్లయి చేస్తాము. లేదా ప్రారంభంలో 4 కాపీలు మాత్రం చాలంటే రు. 1-50 పంపండి. ప్రతి ఒక్కొంటికి 12 న.పై. చొప్పున మీకు లాభిస్తుంది. అయితే డబ్బు పంపేముందు మీ ఊరిలో ఇప్పటికే మా ఏజంటు ఎవరూ లేరు అనే విషయం రూఢిచేసుకోండి.



## చందమామ పబ్లికేషన్సు

వడపలని :: మదరాసు-26

మే 5

విడుదల!

డి.బి.ఎన్. వారి




# పెండ్లిపిలుపు

దర్శకుడు..... ఆమంచర్ల శేషగిరిరావు

రచన.. ఆత్రేయ • ఆరుద్ర • పాటలు.. శ్రీశ్రీ • ఆరుద్ర

సంగీతం.. ప్రసాదరావు • కెమెరా.. బుర్‌బువే • కళ.. కృష్ణారావు



నిర్మాత.....డి.బి.ఎన్.

పూర్ణా రిలీజ్...

మైసూరు - మినర్వా రిలీస్




జె. బి. మంఘారాంవారి

# ఎనర్జీ ఫుడ్ బిస్కత్తులు

తొక్కుడుబండి నడపటానికి పిల్లలు ఎంత సరదాపడతారో—
జె. బి. ఎనర్జీ ఫుడ్ - బిస్కత్తులు తినడానికి అంత
సరదాపడతారు. ఇవి జవము, జీవము, పుష్టినీ ఇచ్చును.

సౌఖ్యమైన సంసారములకు హితకరమైన బిస్కత్తులు

**జె. బి. మంఘారాం అండ్ కంపెనీ,**
గ్వాలియర్ & హైదరాబాదు



# కాల్గేట్‌తో నోటినించి దుర్వాసన రాకుండా చేసుకోండి రోజంతా దంతక్షయం రాకుండాకూడా కాపాడుకోండి!




ఎందుకంటె : ఒక్క పారి తోముకొంటేనే

కాల్గేట్ డెంటల్ క్రీమ్ నోటిలో దుర్వాసన మరియు దంతక్షయమునకు కారణమైన సూక్ష్మ క్రిములను 85% వరకు తొలగించును

కాల్గేట్ 10 మందిలో 7 గురికి నోటి దుర్గంధమును వెంటనే ఆపుతుందని మరియు భోజనము అవగానే కాల్గేట్ తర్వాత పళ్లు తోముకొనుట ద్వారా ఎక్కువ మందికి ఎక్కువ దంతక్షయము అరికట్టిందని దంత శాస్త్ర చరిత్రలో పూర్వము ఎన్నడూ తెలియచేయనంతలా శాస్త్ర పరిశోధనల ఫలితగాను నిరూపించబడినది!

ఊరికే నోటిలో పీళ్లు పోసుకొని పుక్కిలించుట చాలదు. భోజనము అయిన వెంటనే క్రమంతప్పకుండా కాల్గేట్‌తో పళ్లు తోముకోండి. దాని చేవతనమైన నురుగు పళ్ల మధ్య తిపపడకుండా ఉండే పందులలోనికి వెళ్లి నోటి దుర్వాసనకు మరియు దంతక్షయమునకు కారణమైన కుళ్లిపోతున్న ఆహారపు తునకలను తీసివేస్తుంది!

పిల్లలు కాల్గేట్‌తో పళ్లు తోముకొనుటకు యిష్టపడతారు. ఎందుకంటె చాల పేపు ఉండే దాని పిప్పర్‌మెంట్ వంటి రుచి అంటే వారికి ప్రీతి!




మీకు పొడరు కావాలంటే, ఈ లాభములన్నిటిని మీరు కాల్గేట్ టూత్ పొడరు ద్వారా పొందగలరు... ఒక డబ్బా నెలలు వస్తుంది

కాల్గేట్‌తో క్రమం తప్పకుండా పళ్లు తోముకొంటే

- ✔ నోటి దుర్వాసనను పోగొట్టును
- ✔ దంతక్షయమును నిరోధించును
- ✔ పళ్లను మెరుస్తూ ఉండేలా ఉంచును




నోరు ఎక్కువ శుభ్రముగా, తాజాగా ఉండుటకు మరియు పళ్లు ఎక్కువ తెల్లగా ఉండుటకు ప్రపంచములో ఏ యితర పళ్లు తోముకొనే క్రీమ్ కన్న కాల్గేట్‌నే ఎక్కువ మంది వాడుతున్నారు



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచిక నుంచీ రామాయణం ప్రారంభమవుతున్నది. "చందమామ"లో రామాయణం రంగుల బొమ్మలతో ప్రచురించమని అసంఖ్యాకులైన పాఠకులు ఒకటి రెండేళ్ళుగా మాకు రాస్తూ వచ్చారు. వారి కోరిక నెరవేర్చటానికి ఇప్పుడు అవకాశం చిక్కింది.

"కళ్ళు విప్పిన యువరాజు" అన్న కథ ఈ సంచికలోనూ, పై సంచికలోనూ ప్రకటితమవుతుంది. "కొయ్యగుర్రం"లాగే ఇదికూడా పాఠకులకు ఆనందం చేకూర్చుతుందని మా ఆశ.

"రాక్షస ముద్రిక" అనే పేరుతో ప్రచురితమవుతున్న కథ విశాఖదత్తుడి "ముద్రారాక్షసం" అనే నాటకానికి చెందినది. ఈ నాటక కథను చాలా సంగ్రహపరిచి ప్రచురిస్తున్నాము.

సంపుటి 28 : మే 1961 : సంచిక 5



# మర్రిచెట్టు సాక్ష్యం

ఒక ఊళ్ళో నారాయణశెట్టి అని ఒక ధనికుడుండేవాడు. ఆయన ఒకనాడు దూర గ్రామం పోతూండగా దారిలో కోటయ్య అనే గ్రామస్థుడు ఎదురుపడి, "బాబూ, శెట్టి గారూ, ఇల్లంతా కూలిపోయింది. తొలకరి లోపుగా బాగు చేయించుకోకపోతే నేనూ పిల్లలూ ఏ చెట్టు కిందైనా నిలబడాలిసిందే. రెండు పందల రూపాయలిప్పించారా, ధాన్యం అమ్మగానే మీ బాకీ తీర్చేస్తాను," అని ప్రాధేయపడ్డాడు.

నారాయణశెట్టి మెత్తని మనిషి. కోటయ్య మాట తీసెయ్యలేక దగ్గిర ఉన్న సొమ్ములో నుంచి రెండువందలు తీసి ఇచ్చాడు.

కోటయ్య అనుకున్న ప్రకారం ఆ బాకీ తీర్చలేదు. ఒక పంట చెల్లిపోయింది, ఇంకో పంటకూడా వచ్చేసింది.

ఒకనాడు శెట్టి కోటయ్యతో మంచిగా, "ఏం కోటయ్యా, ఆ బాకీ చెల్లు వెయ్యకనే పోతివి. ఏడాది వెళ్ళి రెండో ఏడుకూడా జరుగుతున్నదిగదా!" అన్నాడు.

"బాకీ ఏమిటి?" అన్నాడు కోటయ్య ఆశ్చర్యంగా.

"ఇల్లు బాగు చేయించు కుంటానని ఆ యేడు వేసవిలో రెండు వందలు పుచ్చుకుంటివే. జ్ఞాపకం లేనట్టు మాట్లాడతావేం?" అన్నాడు శెట్టి.

"నేనొకవేళ మరిచిపోయినా మీ దగ్గిర పత్రం ఉంటుందిగా. అది పంపించండి చెల్లువేస్తాను," అన్నాడు కోటయ్య, తాను పత్రం రాసి ఇవ్వనిమాట తెలిసిఉండే.

"నువు నాకు పత్రమైనా రాయలేదే. ఇవాళో రేపో చెల్లువేస్తావుగదా, ఈ భాగ్యానికి పత్రం దేనికి లెమ్మని నేను నిన్ను అడగనూ లేదు," అన్నాడు శెట్టి.

"ఇది చాలా బాగుందండోయ్! మీరెంత సంపన్నులైతే మాత్రం నాకు లేని బాకీలు

వి. సత్యనారాయణ

అంటు గడతారా?" అన్నాడు కోటయ్య గొంతెత్తి, అఘాయిత్యంగా.

నలుగురూ పోగయారు. ఏమిటంటే ఏమిటని శెట్టినీ కోటయ్యనూ అడిగారు.

శెట్టి జరిగిన సంగతి జరిగినట్టుగా చెప్పాడు. అన్నీ అబద్ధాలన్నాడు కోటయ్య. "ఇదేదో మునసబుగారు తేల్చాల్సిందే. అక్కడికి పదండి," అన్నారు ఊళ్ళోవాళ్లు.

"మునసబుగారితో నైతేమాత్రమేం? ఉన్నమాట చెప్పటానికి నాకేం భయం?" అంటూ కోటయ్య ముందు నడిచాడు.

మునసబు చాలా తెలివిగలవాడు, ఆవలిస్తే పేగులు లెక్కపెట్టగలడు. ఆయన శెట్టి చెప్పినదంతా విన్నాడు, కోటయ్య చెప్పినదీ విన్నాడు.

"నేనేం బిచ్చగాణ్ణా? రెండువందలు అప్పుచెయ్యవలిసిన కర్మ నాకేం? నా పొలంలో వచ్చే గింజలమ్ముకుని ఇల్లు బాగుచేయించుకున్న మాట నిజమే. శెట్టిగారు నాకు నిజంగా అప్పు ఇస్తే రెండేళ్ళు పత్రం సాక్ష్యం లేకుండా ఊరుకుంటారా?" అన్నాడు కోటయ్య.

మునసబు శెట్టి కేసితిరిగి, "ఏమండీ, మీరు కోటయ్యకు డబ్బు ఎక్కడ ఇచ్చారు? డబ్బిస్తుండగా ఎవరూ చూడలేదా?" అని అడిగాడు.



"అక్కడ ఎవరున్నారు, బాబూ? ఒక మర్రిచెట్టు కింద కూచుని డబ్బు తీసి ఇచ్చాను," అన్నాడు శెట్టి.

"ఇకనేం? ఆ మర్రిచెట్టును సాక్ష్యం వేసుకుందాం. మీరు ఇప్పుడే వెళ్ళి ఆ మర్రి చెట్టుతో నేను రమ్మంటున్నానని చెప్పి రండి," అన్నాడు మునసబు శెట్టితో.

శెట్టి, "మర్రి చెట్టు వచ్చి సాక్ష్యం చెబుతుందాండి?" అన్నాడు సంకోచంగా.

"నేను రమ్మంటే రాకేం జేస్తుంది? వెళ్ళి త్వరగా చెప్పి రావయ్యా! ఆ మాట కాస్తా మర్రిచెట్టుకు చెప్పి నీ దారిన నువు వచ్చెయ్యి. మేమంతా నీకోసం వేచి ఉంటాం!" అన్నాడు మునసబు.

అక్కడ చేరినవారంతా మునసబు మాటలకు తెల్లబోయారు. ఇక కోటయ్య ఆనందానికి అంతేలేదు. మునసబుకు మతి పోయిందనీ, తన బాకీ రుజువుకాపటం కల్ల అనీ అతను లోలోపల సంతోషించసాగాడు.

కొద్దిసేపు గడవనిచ్చి మునసబు తొందరలో ఉన్నవాడల్లే, "ఏం కోటయ్యా? శెట్టి ఈపాటికి అక్కడికి చేరి ఉంటాడంటావా?" అని అడిగాడు.

"ఎబ్బే! అప్పుడేనాండీ? అది కోసున్నర దూరంలో ఉంది. అదీగాక వాన కురిసిం దిగదా, ఆ చెరువుగట్టు దారి బురద! అయినా అక్కడ ఉండే మర్రిచెట్లలో అసలు దాన్ని పోల్చటమే ఎంతో కష్టమవుతుంది," అన్నాడు కోటయ్య.

మునసబు చేతికర్రతో కోటయ్య వీపు మీద తపీమని కొట్టి, "దొంగ వెధవా! శెట్టి నీకు ఏ చెట్టు కింద డబ్బిచ్చాడో కూడా తెలుసునన్నమాట!" అన్నాడు.

మునసబు యుక్తికి అందరూ ముగ్ధులయారు. కోటయ్య బాకీ ఒప్పుకుని శెట్టికి వడ్డీతో సహా సొమ్ము చెల్లించుకున్నాడు. సొమ్ముపోగా కోటయ్యకు ఊళ్లో తల ఎత్తుకు తిరగటానికి లేకుండా పోయింది.





# శమంతకమణి

పంచమాశ్వాసము :

సత్రాజితు, నతని హితుల
సభకు పిలిచి శ్రీకృష్ణుడు,
" వింటివికద మణి విషయము
వేటకాండ్ర వలన కొంత—

బంధుడవై నీవు నన్ను
నిందించితి పందిటిలో;
అడిగితె నీ తమ్ముడెట్లు
మడిసెనో—మణి ఏమయ్యెనొ ?"

ఇట్లు పలికి కృష్ణుడపుడు
ఇదిగో నీ రత్నమనుచు
కయికొమ్మని మీదవైచె,
గద్దియపై నుంచి లేచె.

సిగ్గుపడుచు సత్రాజితు
చింతించుచు మణిగైకొని,
తలయెత్తక అచటినుండి
తన గృహమున కేగినాడు.

"పాపాత్ముల పాపములను
బాపగలుగు కృష్ణునిపై
పాపము గలదని పల్కిన
పాపిష్ఠుడ నయితి నేను.

లేనిపోని అపవాదును
శ్రీకృష్ణునిపైన పెట్టి
దొంగయనుచు నిందించిన
దుర్మార్గుడ నయితి నేను.

నా పాపం బెట్లు తొలగు ?
నాపై దయ యెట్లు కలుగు ?
బలవంతులతో వైరము
ప్రాణాంతక మగునందురు.

సత్యభామతో గూడను
శమంతకము నప్పగించి
అతని కాళ్ళు పట్టుకొనిన
యపుడు నాకు బ్రతుకు గలదు."

ఉత్పల సత్యనారాయణాచార్య



అని తలంచి సత్రాజితు
తన కూతును కృష్ణమూర్తి
కిచ్చి పెండ్లి జరిపించెను,
ఇంపుగ మణి చదివించెను.

"నాకీ మణి వలదు—ఇద్ది
నీకడ నుండుటయె మేలు!
అంతకంటె మించినదీ
కాంతామణి నాకు చాలు!"

అని కృష్ణుడు దివ్యమణిని
అతనికే ఇచ్చినాడు.
జనులెల్లరు శ్రీకృష్ణుని
ఇనుమిక్కిలి మెచ్చినారు.

అటుపిమ్మట శతధన్వుడు,
అక్రూరుడు, కృతవర్మయు
కుళ్ళుచు ఒకనాడు కలిసి
కుట్రను గావించినారు.

"తన కూతును ఇత్తుననుచు
మనకు తొలుతనుండి చెప్పి
చివరకు ఆ సత్రాజితు
శ్రీకృష్ణుని కిచ్చినాడు.

మాణిక్యమువంటి కన్య
మనకొకనికి కాకపోయె!
మన ముగ్గురిలో ఎవరికి
మణియైనను దక్కదాయె!

శతధన్వుడ! నీ వొకడవె
సామర్థ్యము గలవాడవు,
మణినైనను అపహరించి
మాకు ప్రియము గలిగింపుము."

అని పల్కిన శతధన్వుడు
అమితోత్సాహము పొందెను;
ఆ రత్నము నపహరింప
అదను వేచుకొని యుండెను.

లక్కయింట కౌంతేయులు
రాత్రి తగులబడిపోయిరి—
అను వార్తను విని కృష్ణుడు
హస్తిపురికి వెళ్ళినాడు.

అది అదనని శతధన్వుడు
అర్ధ రాత్రమందు వచ్చి
నిదురపోవు సత్రాజితు
నిష్ఠురముగ చంపినాడు.

బొక్కసలను వెదకి వెదకి,
భోషాణము పగులగొట్టి,
మణిగైకొని తక్షణమే
తన గృహమున కేగినాడు.

తెల్లవాఱి సత్రాజితు
నిల్లాంద్రును గొల్లుమనిరి;
శతధన్వుని పని యిదియని
మతిమంతులు తెలిసికొనిరి.

సత్యభామ దుఃఖించుచు,
జనకు శవము నూనెతొట్టి
యందు పెట్టి ఒక రథమున
హస్తిపురికి వడిగ చేరె.

సత్రాజితు మరణము విని
సత్యభామ నోదార్చుచు,
త్వర త్వరగా శ్రీకృష్ణుడు
ద్వారక కరుదెంచినాడు.

తీర్థయాత్రలకు వెళ్ళిన
ధీరుండగు బలరాముడు
ఆ రోజున సంతసమున
ద్వారక కరుదెంచినాడు.



జరిగిన కథ తన యన్నకు
ఎఱుకపఱిచి, శ్రీకృష్ణుడు
శతధన్వుని నేడొ, రేపొ
చంపుదునని ప్రతినపూనె.

శతధన్వుడు చచ్చునంచు
సత్యభామ సంతసించె,
తండ్రి కపుడు దహనాదులు
తర్పణములు జరిపించెను.

బలరాముడు కృష్ణుండును
కలిసి తనను చంపుదురని
శతధన్వుడు వారి నెదుర
కృతవర్మను సాయమడిగె.

"అయ్యయ్యో, వారలతో
కయ్యమునకు నేను రాను—
నీ మైత్రికి ఒక దండము!
నే మాత్రము రాను, రాను."

అని పలుకగ శతధన్వుడు
అక్రూరుని కడ కేగెను;
కృష్ణునితో పోరాడగ
కేలు గలుపుమని యడిగెను.

అతని మాట లాలకించి
అక్రూరుం డదరి పడుచు
"కృష్ణుడనగ ఎవరందువు?
కేవల శ్రీవిష్ణు వతడు!

గోవర్ధన గిరి యెత్తిన
గోవిందుని ఎదిరింతువ?
కంసు నతడు వధియించుట
కన్నులార కంటివి కద!

అతని యన్న బలరాముడు
ఆగ్రహించి హలమెత్తిన
ముజ్జగములు గజగజమని
మోకరిల్లు నతని మ్రోల.

నీ మైత్రికి ఒక దండము
నే మాత్రము తోడుపడను—"
అని పల్కగ శతధన్వుడు
అతని తోడ ఇట్లు పలికె:

"నన్నిచ్చట కాపాడెడు
నాథుం డొకడైన లేడు!
స్నేహితులని మిమ్ము నమ్మి
సాహసించి చెడిపోతిని."

అని పలికి శమంతకమును
అతనియొద్ద దాచిపెట్టి,
పడిగల ఒక గుఱ్ఱ మెక్కి
అడలుచు పరుగెత్తినాడు.—(సశేషం)



# జ్వాలాద్వీపం

## 17

[భల్లూకరాయుళ్ళు ఉగ్రదత్తుణ్ణి తమ నాయకుడైన కంధుడి దగ్గిరకు తీసుకుపోయారు. కంధుడు ఉగ్రదత్తుడితో ఏకపాదుణ్ణి చంపేందుకు రాక్షసుల సహాయం కావాలని చెపుతూనే, ఏకపాదుణ్ణి చంపటం సాధ్యమయే పని కాదనీ; వాడెవరి నెత్తురు చూసినా, లేక వాడి నెత్తురు ఎవరు చూసినా—తప్పక మరణిస్తారనీ అన్నాడు. తరవాత—]

పులిరాయుళ్ళ నాయకుడైన ఏకపాదుడికి గల అపూర్వ శక్తిని గురించి వినగానే ఉగ్రదత్తుడు నిలువెల్లా కంపించిపోయాడు. ఏకపాదుణ్ణి హతమార్చకుండా తనుగాని, తన స్నేహితులుగాని ఈ జ్వాలాద్వీపాన్ని వదలటం సాధ్యంకాదు. అంతేకాక సామంత రాజైన సుదర్శనుడి కుమార్తె చంద్రసేన కూడా ఆ దుర్మార్గుడి అధీనంలోనే వున్నది. నెత్తురు చిందించకుండా ఆ ఏకపాదుణ్ణి చంపటం ఎలా?

"వాణ్ణి చంపటం అనేది చాలా గడ్డు సమస్య," అన్నాడు కంధుడు. "ఒకసారి వాణ్ణి, నా భటులు ఒంటరిగా దొరకపుచ్చుకున్నారు. కాని, వాళ్లు ఈటెలు ఎత్తి వాణ్ణి గుండెల్లో పొడవబొయ్యేలోపలే, వాడు కత్తితో ముఖంమీద గాటు వేసుకున్నాడు. ఆ నెత్తురు చూస్తూనే, నా భటులందరూ మరణించారు."

"అయితే, మనం వాడి ఎదట పడటంలోనే ప్రమాదం వున్నదన్నమాట! అయితే




యిక వాణ్ణి చంపటం ఎలా?" అన్నాడు ఉగ్రదత్తుడు నిస్పృహగా.

రుద్రుడు, ఏకపాదుడి కోటకేసి సాలోచనగా చూస్తూ, "ఒకసారి మనం ఆ కోటను చుట్టుముట్టగలిగితే, తరవాత వాణ్ణి చంపటం ఎలాగో ఆలోచించవచ్చు. ఆ సమయానికి ఏదో ఒక ఉపాయం తోచకపోదు. ఉగ్రాకుడు పెద్ద జిత్తులమారి!" అన్నాడు.

"బహుశా నా పెంపుడు తండ్రి వచ్చినా ఫరవాలేదనుకుంటున్నట్టున్నది, ఈ రుద్రుడు!" అనుకున్నాడు ఉగ్రదత్తుడు తన మనస్సులో. కాని, కంధుడు చెప్పినట్టు తను తన పెంపుడు తండ్రి సహాయం



కోరకతప్పదు. బలవంతులూ, ప్రాణభయం లేనివాళ్లూ అయిన తన రాక్షసబంట్లు వచ్చి పాల్గొననిదే భయంకర పక్షుల్ని, పులిరాయుళ్ళనూ ఓడించటం సాధ్యంకాదు.

ఉగ్రదత్తుడు యిలా ఆలోచిస్తూ వుండగా కంధుడు అతణ్ణి సమీపించి, "ఉగ్రదత్తా, నీ నిర్ణయం ఏమిటి? నీ పెంపుడు తండ్రి నుంచి సహాయం కోరుతూ వార్త పంపటమా, లేదా?" అని అడిగాడు.

"అక్కడికి ఎవరు వెళ్ళేటట్టు? నేనే వెళ్ళిరానా?" అని అడిగాడు ఉగ్రదత్తుడు.

కంధుడు జవాబు యిచ్చేలోపలే, రుద్రుడు ముందుకు వచ్చి, "కపిలపురం వెళ్ళి, యిక్కడి సంగతి సందర్భాలు చెప్పి సహాయం నేను తీసుకువస్తాను. నన్ను పోనివ్వండి," అన్నాడు.

ఇందుకు కంధుడూ, ఉగ్రదత్తుడూ కూడా ఒప్పుకున్నారు. తరవాత కంధుడు తన అనుచరుల్లో ఒకణ్ణి పిలిచి, రుద్రుణ్ణి భయంకర పక్షిమీద ఎక్కించుకుని కపిలపుర రాజ్యంలోని అడవుల్లో దించాలని చెప్పాడు. దానికి వాడు అయిష్టంగా ముఖం పెట్టి, "అయ్యా, మీకూ తెలుసుగదా? ఈ ఉగ్రదత్తుణ్ణీ యితర్లనూ పులిరాయుళ్ళు అపహరించి ఈ ద్వీపానికి తెచ్చినప్పటి



నుంచీ, రాక్షసులూ, ప్రజలూకూడా రేయిం బవళ్ళు భయంకర పక్షుల కోసం కాపలా కాస్తున్నారు. మేము ఆ ప్రాంతాల దిగామో, వచ్చిన పని చెప్పేముందే మమ్మల్ని వాళ్ళు చంపేస్తారు!" అన్నాడు.

ఉగ్రదత్తుడు ఓ క్షణకాలం ఆలోచించి, "అయితే, రుద్రుడు ఒక పని చేస్తే పోతుంది. అడవిలో దిగేముందు తనెవరో అక్కడి కాపలావాళ్ళు తెలుసుకునేందుకు వీలుగా, తన దుస్తుల్లో ఏదో ఒకదాన్ని పైనుంచి కిందకు పడవెయ్యటం బావుంటుంది. నేను నా పెంపుడు తండ్రికి రాసే లేఖ నొకదాన్నికూడా, ఆ దుస్తుల్తోపాటు పడవేస్తే, సంగతి సందర్భాలు వాళ్ళు తెలుసుకుంటారు," అన్నాడు.

ఈ ఉపాయం అందరికీ నచ్చింది. ఉదయం కాగానే ప్రయాణం అయేందుకు చేయవలసిన ఏర్పాట్లు చేసుకోవలసిందిగా, తన అనుచరుడికీ, రుద్రుడికీ చెప్పి, కంధుడు ఉగ్రదత్తుణ్ణి వెంటబెట్టుకు వెళ్ళి, అతడి కోసం ఏర్పాటు చేసిన శయనాగారాన్ని చూపించాడు.

* * *

తన కోటముందున్న ఆవరణలోని ఒక పెద్ద రాతిమీద తల రెండు చేతులమధ్యా



పెట్టుకుని విచారంగా కూచునివున్న ఉగ్రాక్షుడి వద్దకు, అతడి బంట్లు యిద్దరు పరిగెత్తుకుంటూ వచ్చి, "మహానాయకా, ఏదో ప్రమాదం, అంతా అయోమయం, వాడికి మతిపోయన్నా వుండాలి!" అంటూ వగరుస్తూ నిలబడ్డారు.

"ఏమిటి ప్రమాదం? ఏమిటి అయోమయం? ఏమిటీ వాగుడు? మీకేనా మతిపోయింది!" అంటూ ఉగ్రాక్షుడు కళ్ళెర్ర చేసి తన బంట్లకేసి చూశాడు.

తమ నాయకుడి ముఖంకేసి చూస్తూనే, ఇద్దరు రాక్షసబంట్లూ తబ్బిబ్బు పడిపోయి, తడబడుతూ, "ఎవడో ఒక జ్వాలాద్వీపం





వాడు పట్టపగలే మన అడవిమీద ఎగురుతూ, కిందికి దిగాలని ప్రయత్నం చేస్తున్నాడు. మన కాపలావాళ్ళు వాడిమీదకి బాణాలూ, గదలూ విసిరారు. వాడు మూటలా కట్టిన ఏదో వస్తువును కింద పడవేసి, ఇంకా అక్కడే ఎగురుతున్నాడు," అన్నారు.

"ఆ వస్తువేది? వెంట తెచ్చారా?" అన్నాడు ఉగ్రాకుడు కోపంగా.

"అది ఎక్కడో చెట్లలో పడింది. మన వాళ్లు దానికోసం గాలిస్తున్నారు," అన్నారు రాక్షసబంట్లు.

"అయితే, ఈలోపల మీకు మతులు పోయి పలవరిస్తూ, నా దగ్గిరకు పరిగెత్తు



కొచ్చారన్నమాట! అక్కడికి పదండి!" అంటూ హుంకరించి ఉగ్రాకుడు తన భటులవెంట బయలుదేరాడు.

ఉగ్రాకుడు అడవిలో కొంతదూరం వెళ్లే సరికి ఒక ఎత్తయిన రాతిగుట్ట పక్కనేవున్న చెట్టుకింద కొందరు రాక్షసులూ, ప్రజలూ గుంపుగా కూడి రణగొణధ్వని చేస్తున్నారు. ఒక భయంకరపక్షి పైన చెట్లమీద వలయాకారంగా ఎగురుతున్నది. ఉగ్రాకుడు తమ కేసి రావటం చూస్తూనే గుంపులోనుంచి ఒక రాక్షసుడూ, ఇద్దరు ప్రజలూ పరిగెత్తుకుంటూ అతడికి ఎదురు వచ్చారు. రాక్షసుడి చేతిలో ఒక చిన్న రంగు వస్త్రం, గుండ్రగా కర్రకు చుట్టివున్న ఒక పత్రం వున్నాయి.

"మహానాయకా, ఆ భయంకర పక్షి మీద ముగ్గురు మనుషులున్నారు. వాళ్ళు పులిరాయుళ్ళు మాత్రం కాదు. వాళ్ళల్లో యిద్దరు ఎలుగ్గొడ్డు చర్మాలు ధరించి వున్నారు. ఒకవేళ అవి మనను మోసగించేందుకు ఆ దుర్మార్గులు వేసిన మారువేషాలేమో! వాళ్ళు వీటిని కింద పడవేశారు," అంటూ వస్త్రాన్నీ, కర్రకు చుట్టివున్న పత్రాన్నీ ఉగ్రాకుడికిచ్చాడు.

ఉగ్రాకుడు వాటిని అందుకుని పత్రాన్ని తెరిచి చూస్తూ, "ఈ మానవ భాష చదవ





మనా నాకిస్తున్నావ్? బుద్ధిలేదా? ఒరే, నర మానవా, ఈ గిలుకుడేంటో చదువు!" అంటూ పక్కనవున్న మనిషికి యిచ్చాడు. వాడు అంతా చదివి ఆశ్చర్యపోతూ, "మహారాక్షసా! ఇది నీ పెంపుడు కొడుకు ఉగ్రదత్తుడు జ్వాలాద్వీపాన్నుంచి రాశాడు. ఆ భయంకర పక్షిమీద వున్న ముగ్గురిలో ఒకడు రుద్రుడట. తతిమ్మా యిద్దరూ భల్లూక రాయుళ్ళు, మనకు మిత్రులు," అన్నాడు.



"అహ్హా, నా ఉగ్రదత్తుడు బతికే వున్నాడా? నాకు మొదటినుంచీ వాడు ఏదో ఒకనాడు తిరిగి, నా అరణ్య రాజ్యం వస్తాడని నమ్మకం వున్నది. అరే! వాడే రాక, ఈ రుద్రుణ్ణి ఎందుకు పంపినట్టు? సరే, ఆ భయంకరపక్షి మీద వున్నవాళ్ళకు కిందికి దిగమని సౌంజ్ఞలు చేయండి," అన్నాడు ఉగ్రాక్షుడు సంశయిస్తున్నవాడిలా.

కొందరు రాక్షసులూ, ప్రజలూ కలిసి చెట్లమీది నుంచీ, గుట్టలమీది నుంచీ భయంకర పక్షికేసి చేతులూ, పొడుగాటి చెట్ల కొమ్మలూ వూపుతూ దిగవలసిందిగా సౌంజ్ఞలు చేశారు. భయంకరపక్షి ఏటవాలుగా ఎగురుతూ వచ్చి ఉగ్రాక్షుడికి అల్లంత దూరంలో దిగింది. ఆ వెంటనే పక్షిమీది నుంచి రుద్రుడు ఛెంగున కిందికి దూకి, కేకలు పెడుతూ ఉగ్రాక్షుడి దగ్గిరకు పరిగెత్తుకు వచ్చాడు.

రుద్రుణ్ణి చూస్తూనే ఉగ్రాక్షుడికి ఎంతో ఆనందం కలిగింది. అతడు రుద్రుణ్ణి రెండు చేతులతో పైకెత్తి, ఆప్యాయంగా అటూ యిటూ వూపి కిందికి దించుతూ, "ఉగ్రదత్తుడు క్షేమంగా వున్నాడా? వాడు నీతోపాటు ఎందుకు రాలేదు? అరుద్రుడేమయ్యాడు?" అని అడిగాడు.

"ఉగ్రదత్తుడు క్షేమంగానే వున్నాడు. అరుద్రుడూ, సామంతరాజు సుదర్శనుడి కూతురు చంద్రసేనా పులిరాయుళ్ళవద్ద బందీలుగా వున్నారు. ఆ పులిరాయుళ్ళ



నాయకుడు ఏకపాదుడనే వాణ్ణి చంపితే తప్ప, వాళ్ళూ, ఉగ్రదత్తుడూ క్షేమంగా యిక్కడికి రాలేరు. అందుకు నిన్ను సహాయం రావలసిందిగా ఉగ్రదత్తుడు కోరాడు," అన్నాడు రుద్రుడు.

"నా కొడుకు, నన్ను సహాయం రావలసిందని కోరటమా? ఏమిటీ మాటలు! వాడు నా నుంచి పారిపోవాలని చూసినా, పధ్నాలుగు లోకాలూ గాలించి పట్టుకుని, కాళ్ళూ చేతులూ కట్టి, కోటలో పడవేస్తాను. నా తరవాత ఈ అరణ్యరాజ్యానికి నాయకు లెవరు?" అంటూ అడవి మార్మోగేలా ఉగ్రాక్షుడు హుంకరించాడు.



ఉగ్రాక్షుడు కొంత శాంతించిన తరవాత రుద్రుడు, జ్వాలాద్వీపంలో వున్న రెండు శత్రుపక్షాల సంగతీ, భల్లూకరాయుళ్ళ నాయకుడైన కంధుడు తమకు చేసిన సహాయం సంగతీ చెప్పాడు.

"పడవల్లో బయలుదేరి రావాలి. మీరు జ్వాలాద్వీపం చేరేందుకు రెండు పగళ్ళూ, రెండు రాత్రులూ పడుతుంది. దారి చూపేందుకు ఒక భల్లూకరాయుడు నా వెంట వచ్చాడు," అంటూ అతణ్ణి ఉగ్రాక్షుడికి పరిచయం చేశాడు. తరవాత రుద్రుడు దారి చూపవచ్చిన భల్లూకరాయుణ్ణి ఉగ్రాక్షుడి దగ్గిర వదిలి, తాను తిరిగి జ్వాలాద్వీపం వెళ్ళిపోయాడు.

ఉగ్రాక్షుడు తన బంట్లలో మెరికలవంటి వారిని అయిదు వందలమందిని ఏరి, వాళ్ళతో జ్వాలాద్వీపం వెళ్ళేందుకు ప్రయాణం కట్టాడు. వాళ్ళు మహారణ్యాల్లో పడి, కొండలూ, నదులూ దాటుతూ, వారం రోజుల తరవాత సముద్రతీరం చేరారు.

రాక్షసుల్లో చాలామంది సముద్రాన్ని యిదే మొదటిసారిగా చూడటం. కంటికాని సంతవరకూ వున్న ఆ మహా ప్రవాహాన్ని చూస్తూనే వాళ్ళు నివ్వెరపోయారు. "ఇంత మహాసముద్రం మధ్య నేల ఎలావుంటుంది?





ఇందులో ఏదో మోసం వున్నది. మనకు నీటిగండం తప్పదు," అని వాళ్ళు గుసగుసలు ప్రారంభించారు.

ఈ సంగతి తన చెవినిపడగానే ఉగ్రాక్షుడు రౌద్రరూపం దాల్చి, "అడవిచెట్లు నరికి, వాటి బాదులతో ఒక్కొక్కటీ యాభై మందిని మోయగలిగేట్టుగా పది పడవలు కట్టండి. వాటిని జాగర్తగా కట్టుకున్నారా, మీరు సముద్రం దాటి జ్వాలాద్వీపం చేరుతారు. లేదా మీరు భయపడుతున్నట్టు మీకు నీటిగండం తప్పదు!" అన్నాడు.



ఉగ్రాక్షుడి హెచ్చరిక రాకనుల్లో ఒక చెంప భయాన్నీ, మరోచెంప ఆత్మవిశ్వాసాన్నీ, తెగువనూ కలిగించింది. వాళ్ళు మహావృక్షాలను వేళ్ళకంటా ఊడబెరికి, ఊడలతో ఒక మానుకూ ఇంకొక మానుకూ బంధాలు బిగించి పెద్దపెద్ద తెప్ప పడవలు తయారు చేశారు.

అన్ని సిద్ధమై ఒకనాటి సూర్యోదయం వేళ ఉగ్రాక్షుడు సముద్రం మీద బయులుదేర పోతూండగా, చిత్రసేనుడి దగ్గిరనుంచి ఒక దూత అక్కడికి వచ్చాడు. అతడి ద్వారా; జ్వాలాద్వీప పరిస్థితులు చిత్రసేనుడికి తెలుసునన్న విషయం ఉగ్రాక్షుడు తెలుసుకున్నాడు. తన దూతద్వారా చిత్రసేనుడు, ఉగ్రాక్షుడికి కొంత సైనిక సహాం చేస్తానని కబురు పంపాడు.

"తన కుమారుణ్ణి పులిరాయుళ్ళు ఎత్తుకుపోయారని తెలిసి, మహారాజూ మహారాణీ దుఃఖసాగరంలో మునిగిపోయారు. ఈ వార్తతోపాటు సామంతుడి కుమార్తె చంద్రసేనకూడా అపహరించబడిందని తెలిసి మరింత బాధపడ్డారు. ఆ సామంత రాజు సుదర్శనుడు లోగడ ద్రోహి నాగవర్మతో జరిగిన యుద్ధాల్లో మహారాజుకు ఎంతగానో సహాయపడ్డాడు. ఆయన మహారాణికి బంధువుకూడా. రాకుమారి చంద్రసేనతో యువరాజుకు వివాహం జరపటం



బావుంటుందనికూడా వారు భావిస్తున్నారు," అని చెప్పాడు దూత.

దూత మాటలు వింటూనే ఉగ్రాక్షుడు కోపంతో నిలువెల్లా కంపించిపోయాడు. రాత్రి గడను దూత పైకి ఎత్తబోయినవాడల్లా తమాయించుకుని, "వాడు యువరాజు కాదు, ఉగ్రదత్తుడు, నా కుమారుడు! నా కుమారుడి కోసం దుఃఖించే హక్కు మీ రాజుకూ రాణికీ లేదన్నానని చెప్పు. ఈ సామంతుడెవడు? సుదర్శనుడెవడు? వాడి పేరుకూడా ఎన్నడూ వినలేదే! వాడి కుమార్తె చంద్రసేన ఉగ్రదత్తుడికి తగునో తగదో తేల్చవలసినవాణ్ణి, నేను! తెలిసిందా? ఇక వెళ్ళు!" అంటూ హుంకరించాడు.

ఉగ్రాక్షుడితో యింకేమి చెప్పినా తన ప్రాణానికే ముప్పురావచ్చని భావించిన దూత తిరిగి చూడకుండా అక్కడినుంచి పారిపోయాడు. తరవాత ఉగ్రాక్షుడి అజ్ఞ కాగానే రాక్షసులు పడవలను సముద్రం లోపలికి కొంతదూరం లాగి, పశువుల చర్మాలతో కుట్టిన తెరచాపలను గాలివాలుకు ఎత్తారు. అన్నిటికన్నా ముందున్న పడవలో దారిచూపేందుకు వచ్చిన భల్లూకరాయుడు ఎక్కాడు.

రాక్షసులెక్కిన పడవలు ఏప్రమాదం లేకుండానే ఆ పగలూ, రాత్రీ సముద్రంలో తూర్పుదిక్కుగా ప్రయాణించినై. కాని, మర్నాటి సూర్యోదయంవేళకు వాళ్ళకు దూరంగా సముద్రంలో ఆకాశం ఎత్తు లేస్తున్న మంటలు కనిపించినై. "జ్వాలా ద్వీపం! జ్వాలాద్వీపం!" అంటూ కొంత భయంగా కొంత ఉత్సాహంగా రాక్షసులు కేకలు పెట్టారు. ఆ తరవాత కొద్దిసేపటికల్లా, ద్వీపం వైపునుంచి తమకేసి వస్తున్న నల్లని నలుసంత చిన్న ఆకారం ఒకటి కనిపించి, చూస్తూండగానే పెరిగి పెద్దదై—భయంకర పక్షిగా పడవలమీద ప్రత్యక్షమైంది.

—(ముగింపు వచ్చే సంచికలో)





# దేవతల పక్షపాతం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీవు ఏ దేవతలను తృప్తిపరచటానికై ఇంత శ్రమపడుతున్నావో తెలియదు గాని, నీ మేలుకోరి నీ కొక హెచ్చరిక చేస్తాను. దేవతలు పక్షపాత బుద్ధి గలవారు. వారు ఒక్కొక్కసారి తమని ఎంత శ్రద్ధగా ఉపాసించిన వారికికూడా వరాలివ్వక అశ్రద్ధ చూపిన వారికే సాక్షాత్కరిస్తారు. ఈ విషయం నిరూపించటానికి నీకు విక్రమతుంగుడి కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు :

ఒకప్పుడు పాటలీపురానికి విక్రమతుంగుడు రాజుగా ఉండేవాడు. ఆయన దాతృత్వంలో గాని, యుద్ధరంగంలో గాని ఎన్నడూ వెనకంజవేసి యెరగడని అందరూ చెప్పుకునేవారు.



ఒకనాడా రాజు సపరివారంగా వేటకు బయలుదేరాడు. దారిలో ఒకచోట ఒక బ్రాహ్మణుడు, బిల్వహోమం చేస్తూ కనిపించాడు. "ఓ బ్రాహ్మడా! ఏమికోరి నీవు ఈ బిల్వహోమం చేస్తున్నావు?" అని అడగాలని రాజుకు కోరికపుట్టింది, కాని తన మనస్సంతా వేటపైన ఉండటంచేత ఆయన తిన్నగా అరణ్యానికి వెళ్లాడు.

అక్కడ పగలల్లా రాజు తృప్తిగా వన మృగాలను వేటాడి మళ్లీ సపరివారుడై పాటలీపురానికి బయలుదేరాడు. దారిలో ఆయనకు మళ్లీ ఆ బ్రాహ్మడే కనిపించాడు; ఆయన ఇంకా బిల్వహోమం చేస్తూనే ఉన్నాడు. ఈసారి రాజు బ్రాహ్మణ్ణి సమీపించి, నమస్కారం చేసి, "బ్రాహ్మడా, ఎందుకై ఈ బిల్వహోమం చేస్తున్నావు?" అని అడిగాడు. దానికా బ్రాహ్మడు, "రాజా, నా పేరు నాగశర్మ. నేను ఈ మారేడు పళ్ళతో అగ్నిదేవుణ్ణి అర్చించి, తృప్తిపరచి, ఆయన అనుగ్రహంచేత బంగారు మారేడు పళ్ళు పొందాలని ఇలా హోమం చేస్తున్నాను. ఎంతో నిష్ఠతో దీర్ఘకాలంగా హోమం చేస్తున్నప్పటికీ ఇంతవరకు అగ్ని దేవుడు సాక్షాత్కరించలేదు," అని జవాబిచ్చాడు. అది విని రాజు, "అయితే నా కొక మారేడుపండు ఇయ్యి. నాకు అగ్ని దేవుడు ప్రత్యక్షమవుతాడేమో చూస్తాను," అన్నాడు.

బ్రాహ్మడు నిర్ఘాంతపోయి, "అదేమిటి, రాజా? నేను పవిత్రంగానూ, నిష్ఠగానూ ఇంతకాలం నుంచీ హోమం చేస్తున్నా అగ్ని దేవుడు సాక్షాత్కరించ లేదే, నీవు అపవిత్రుడివి, దీక్షపూనిన వాడివికాదు, అప్పటికప్పుడు కలిగిన అభిప్రాయంతో ఒక్క మారేడుపండు హోమం చేయగానే ప్రత్యక్షమవుతాడా?" అని అడిగాడు.

"అలాటి సంకోచాలేమీ వద్దు. ఒక్క మారేడుపండు నా కియ్యి. ఏం జరుగుతుందో చూస్తాం!" అన్నాడు రాజు.

సరేనని బ్రాహ్మడు రాజు కొక మారేడు పండిచ్చాడు. రాజు ఆ పండును తీసుకుని, "అగ్నిదేవా? నీకీ ఫలం చాలని పక్షంలో నా తల నరికి నీకు హోమం చేస్తాను," అంటూ దానిని అగ్నిలో హోమం చేశాడు.

మరుక్షణమే అగ్నిగుండంలో నుంచి అగ్నిదేవుడు లేచి, ఒక బంగారు మారేడు పండును రాజు చేతిలో ఉంచాడు. రాజు ఆ బంగారు మామిడిపండును బ్రాహ్మడి కిచ్చి పాటలీపురం తిరిగివచ్చాడు.

ఇది జరిగిన కొద్దిరోజులకే రాజు వద్దకు దత్తశర్మ అనే బ్రాహ్మణ బ్రహ్మచారి వచ్చి, "రాజా, సిద్ధుడైన మా గురువుగారి అనుగ్రహంచేత నేనొక భస్మం తయారుచేశాను. రాగి కరిగించి అందులో ఒక చిటికెడు భస్మం వేసినట్టయితే ఆ రాగి యావత్తూ బంగారం కావాలి. ఇది మా గురువుగారి సమక్షంలో ఒకసారి జరగటం నేను కళ్ళారా చూశాను. కాని ఏ కారణంచేతనో నాకు భస్మం పని చెయ్యకుండా ఉన్నది," అని చెప్పాడు. రాజు ఆ బ్రహ్మచారితో, "నా ఎదటచెయ్యి, చూస్తాను," అన్నాడు.

రాజభటులు కొంత రాగి తెచ్చారు. బ్రహ్మచారి దాన్ని కరిగించి అందులో చిటికెడు భస్మం వేశాడు. కాని రాగి బంగారంగా




మారలేదు. ఏమి జరిగినదీ బ్రహ్మచారి చూడలేకపోయినా, అగ్నిదేవుణ్ణి ప్రసన్నుణ్ణి చేసుకున్న రాజు చూడగలిగాడు. బ్రహ్మచారి భస్మం తీసి కరిగించిన రాగిలో వేసే సమయంలో ఒక యక్షుడు అదృశ్యంగా ఉండి ఆ భస్మాన్ని కాజేసి రాగిలో పడకుండాచేశాడు.

ఇది చూచిన రాజు బ్రహ్మచారి చేతి నుంచి భస్మాన్ని తానే తీసుకుని కరిగించిన రాగిలో వేశాడు. యక్షుడు ఈసారి భస్మాన్ని హరించలేక, ఒక నవ్వు నవ్వి వెళ్ళిపోయాడు.

రాజు భస్మం చల్లిన మరుక్షణం రాగి యావత్తూ బంగారంగా మారిపోయింది.

బ్రహ్మచారి జరిగిన సంగతి తెలుసుకుని రాజుకు ఆ భస్మం తయారుచేసే పద్ధతి చెప్పేశాడు. అందుకు ప్రతిఫలంగా రాజు ఆ బ్రహ్మచారికి వివాహం చేయించి కావలసిన వసతులన్నీ కల్పించాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, దిక్పాలకులలో ఒకడై, సమస్త భూతాలకూ అధారభూతుడైన అగ్నిదేవుడు రాజుపట్ల పక్షపాతం వహించటానికి కారణమేమిటి? ఎంతో శ్రద్ధానిష్ఠలతో ఆ బ్రాహ్మడు దీర్ఘకాలం బిల్వహోమం చేసినా అనుగ్రహించక, ఆ దేవుడు నిష్ఠాశ్రద్ధలు లేని రాజు చేసిన ఏక బిల్వహోమానికి ఎందుకు తృప్తి చెందాడు? చివరకు ఆ బ్రాహ్మడికి ఒక్క బంగారు మారేడుపండు మాత్రమే దొరకట మేమిటి? రాజుకు అంతులేని బంగారం తయారుచేసే మార్గం సిద్ధించట మేమిటి? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి రాజు, "దేవతలను అర్చించే వారికి కేవలమూ నిష్ఠా, శ్రద్ధా ఉంటే చాలదు. సత్త్వం (పట్టుదల) కూడా ఉండాలి. బ్రాహ్మడు మంద సత్త్వుడు, అగ్నిదేవుడు ఎప్పటికి సాక్షాత్కరిస్తే అప్పటికే సాక్షాత్కరిస్తాడనుకుంటూ అలాగే బిల్వహోమం సాగిస్తాడు. రాజు తీవ్ర సత్త్వుడు. ఒక్క మారేడుపండు హోమం చెయ్యగానే అగ్నిదేవుడు ప్రత్యక్షం కాకపోతే ఆయన నిజంగానే తన తల నరికి హోమంచేసి ఉండేవాడు. అందుకే అగ్ని ఆయనకు వెంటనే ప్రత్యక్షమయాడు. బ్రాహ్మడికీ, రాజుకూ కలిగిన ఫలితాలుకూడా వారివారి సత్త్వాలకు అనుగుణమైనవి గాని వారు చేసిన బిల్వాల సంఖ్యకు అనుగుణమైనవి కావు," అని సమాధానం చెప్పాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. —(కల్పితం)





# చిదంబరం రహస్యం

ఒక వూళ్లో చిదంబరం అనే సాహుకారు ఉండేవాడు. అతడు పరమ లోభి. కాని అతని భార్యకు దానధర్మాలంటే ఆసక్తి.

ఒకప్పుడు పండక్కి గ్రామస్థులందరూ చందాలు వేసుకుని, హరిదాసుగారి చేత కాలక్షేపం చేయించటానికి ఏర్పాటు చేసుకున్నారు. చిదంబరం ఒక్క పైసా అయినా ఇవ్వక, "నా కిలాంటి డబ్బు దండగ పనులు ఇష్టంలేదు. నాకీ కాలక్షేపా లేవీ అక్కర్లేదు," అని కచ్చితంగా చెప్పేశాడు.

ఆ క్షణం నుంచీ భార్యాభర్తల మధ్య కలహం ప్రారంభమైంది. "డబ్బివ్వకపోతే పోయె, ముక్తి మార్గం తెలుసుకోవటానికి ముచ్చటగా మూడే మూడు ముక్కలు విని రాకూడదా ?" అని భార్య పట్టు పట్టింది. ఇల్లాలి పోరు పడలేక, సరే లెమ్మని చిదంబరం మూడే మాటలు వినటానికి వప్పుకొన్నాడు.

ఆ రాత్రి కాలక్షేపానికి పెద్ద మర్రి కింద పందిట్లో యేర్పాట్లు జరిగాయి. జనం కిటకిటలాడుతున్నారు. చిదంబరం కూడా వచ్చి ఒక పక్క కూర్చున్నాడు. హరిదాసుగారు పూలమాల వేసుకుని, కాళ్ళ గజ్జెలు కట్టుకుంటూ వుండగా గ్రామాధికారి సభవేపు తిరిగి, "పెద్దలంతా వచ్చినట్టేనా, ఇంకెవరైనా రావాలా ?" అని అడిగాడు. "ఓహో, ఇది దాసుగారు చెప్పే మొట్టమొదటి మాట కామాలు. వినవలసిన మూడు మాటల్లోనూ అప్పుడే ఒకటి వినేశాను," అనుకున్నాడు చిదంబరం.

అంతలోనే చోటు చాలక జనం కొంత మంది నించుని, కూర్చున్నవాళ్ళకి అడ్డంగా వున్నారు. గ్రామాధికారి మళ్ళీ లేచి, "కూర్చోండి! కూర్చోండి!" అంటూ వాళ్ళను హెచ్చరించాడు. ఇదే రెండో మాట అనుకున్నాడు, చిదంబరం.

జలదంకి వెంకటయ్య

జనం విపరీతంగా రావటంవల్ల స్థలం లేక కొంతమంది వచ్చిన దారినే మళ్ళి పోవలసి వచ్చింది. అప్పుడు గ్రామాధికారి, "వెళ్ళకండి! వెళ్ళకండి! దాసుగారు వచ్చేస్తున్నారు!!" అని మళ్ళీ జనానికి నచ్చ జెప్పాడు. ఇది విని చిదంబరం, "సరే, నేను విన వలసిన మూడు మాటలూ పూర్తి అయినాయి," అనుకుని, ఇంటికి వచ్చేసి హాయిగా నిద్రపోయాడు.

ఈ సంగతి తెలియక, ఎంత చెప్పినా తన మాట భర్త చెవికెక్కలేదుకదా అని కోపం కొద్దీ చిదంబరం భార్య పిల్లల్ని వెంట బెట్టుకుని కాలక్షేపానికి వెళ్ళిపోయింది. ఆ సందట్లో ఆమె ఇంటి తలుపు వెయ్యడం మరిచిపోయింది.

ఇదంతా కనిపెట్టి చూస్తూన్న దొంగలు ఆమె వెళ్ళిపోగానే ఇంట్లో చొరబడ్డారు. మెల్లిగా అడుగులో అడుగు వేసుకొంటూ, గదిలోకి వెళ్ళేసరికి, చిదంబరం, "పెద్ద లంతా వచ్చినట్టేనా, ఇంకెవరైనా రావాలా?" అని పలవరించాడు.

దొంగలు అదిరిపడ్డారు.

ఇంటి యజమాని మేలుకునే వున్నాడని తెలుసుకుని, ఎక్కడివాళ్ళక్కడే చతికిల బడ్డారు.

అప్పుడు చిదంబరం, "కూర్చోండి! కూర్చోండి!" అని గ్రామాధికారి చేసిన హెచ్చరిక పలవరించాడు.

"అరే, మనం కూర్చోవటంకూడా ఈయనకి తెలిసిందే! మనల్ని చూసే వుంటాడు," అని అనుకుని, ఒక్కొక్కళ్ళే లేచిపోవటానికి సిద్ధపడ్డారు.

అంతలో నిద్రపోతున్న చిదంబరం మళ్లీ, "వెళ్ళకండి, వెళ్ళకండి! దాసుగారు వచ్చేస్తున్నారు!!" అని పలవరించాడు.

యజమాని తమను తరుముకు వస్తున్నాడని భయపడి, వెనక్కి తిరిగి చూడకుండా దొంగలు కాలికొద్దీ పరుగుచ్చుకున్నారు.






మగధదేశానికి రాజధాని అయిన పాటలీపుత్రాన్ని నందుడనే రాజు పాలిస్తూ ఉండేవాడు. అయనకు మంత్రి అయిన రాక్షసుడు స్వామిభక్తుడూ, సమర్థుడూనూ.

నందరాజుకు ఇద్దరు భార్యలు. ఒకతె సునంద అనే క్షత్రియ స్త్రీ. రెండో ఆమె మురఅనే శూద్ర స్త్రీ. వీరిలో ముందుగా మురకే కొడుకు కలిగాడు. తల్లిపేర అతన్ని అందరూ మౌర్యుడని పిలిచేవారు. మౌర్యుడు పుట్టిన కొంతకాలానికి సునంద తొమ్మిదిమంది కొడుకులను కన్నది. వీరికి నవనందులని పేరు.

కొంతకాలం గడిచాక నందరాజు రాజ్యభారాన్ని తన కొడుకులకు వప్పగించ నిశ్చయించాడు. వారిలో మౌర్యుడే పెద్ద అయినప్పటికీ అయన అతనికి సేనాని పదవి మాత్రమే ఇచ్చి, నవనందులందరూ రాజులుగా ఉండేటట్టు నిశ్చయించాడు.

మౌర్యుడు తనకు అన్యాయం జరిగినట్టు భావించాడు. నవనందులు మూఢులు, తాను తెలివిగలవాడు. ప్రజలకు కూడా మౌర్యుడిపైనే గౌరవం హెచ్చు. అతను నవనందుల మధ్య సులువుగా చీలికలు పెట్టాడు. లక్షణాలన్నీ చూడగా మౌర్యుడూ, అతని నూరుగురు కొడుకులూ మగధ రాజ్యానికి చిచ్చుపెట్టేలాగ కనబడ్డారు. అందుచేత నవనందులూ, మంత్రులూ కలిసి కుట్రచేసి మౌర్యవంశ నిర్మూలనానికి ఉపాయం ఆలోచించి, వారినందరినీ ఒక పాతాళ గృహంలోకి పంపి ద్వారం మూసేశారు. అక్కడ నూరు కంచాలలో భోజనమూ, నూరు దీపాలూ ఉన్నాయి. ఆ ఆహారం ఒక్కడే తింటే చాలా రోజులకు సరిపోతుంది. అందుచేత మౌర్యుడు తన కొడుకులలోకెల్లా చిన్నవాడైన చంద్రగుప్తుడికి ఆ ఆహారం ఇచ్చి, పాతాళగృహం

విశాఖదత్త నాటక కథ



నుంచి బయటపడే అవకాశం దొరికితే మౌర్యులపక్షాన పగ తీర్చుకునేటట్టు ప్రమాణం తీసుకున్నాడు.

కొంతకాలం గడిచింది. వంగదేశంనుంచి కొందరు మనుషులు ఒక బోనులో ఒక సింహం బొమ్మను పాటలీపుత్ర రాజసభకు తెచ్చారు. ఆ బోనుపై, "చాతనయితే ఈ సింహాన్ని బోను నుంచి వెలువరించండి," అని ఉన్నది. బోనుకు ఎక్కడా ద్వారం లేదు. సింహాన్ని వెలువరించే ఉపాయం ఎవరికీ తెలియలేదు.

"చంద్రగుప్త మౌర్యుడే బతికి ఉంటే, ఆ కుర్రవాడు ఉపాయం చెప్పేవాడు," అని సభలో ఒకరు అన్నారు. వెంటనే పాతాళగృహానికి దారి తెరిచి చూశారు. అందరు మౌర్యులూ చనిపోయారుగాని చంద్రగుప్తు డింకా ప్రాణాలతో ఉన్నాడు.

చంద్రగుప్తుడు బోనులోది లక్క సింహమై ఉంటుందని గ్రహించి బోనులోకి కాల్చిన ఇనపకర్రలు పోనిచ్చి సింహాన్ని కరిగించాడు. సింహం కరిగి బోనులోనుంచి బైటికి వచ్చింది. చంద్రగుప్తుడి యుక్తిని అందరూ మెచ్చుకున్నారు.

ఇంత తెలివిగల వాడివల్ల ప్రయోజనం ఉంటుందనే ఉద్దేశంతో నవనందులు చంద్రగుప్తుణ్ణి భోజనశాలకు అధికారిగా నియోగించారు. ఈ విధంగా ప్రాణాలతో బయటపడి అతను తన పెద్దలకు శ్రాద్ధాలు పెట్టి, నివురు కప్పిన నిప్పులాగా అణిగి ఉండి, భోజనశాలకు సంబంధించిన పనులు చూడసాగాడు.

ఒకనాడు చంద్రగుప్తుడు ఊరిబయట ఒక బ్రాహ్మణ యువకుణ్ణి చూశాడు. ఆ యువకుడి ప్రవర్తన చూసి అతనికి విస్మయం కలిగింది. ఎందుకంటే ఆ బ్రాహ్మణ యువకుడు తన కాలిలో గుచ్చుకున్న దర్భముల్లును తీసి, కాల్చి భస్మం చేసి, దాన్ని నీటిలో కలుపుకుని తాగేశాడు.

"స్వామీ, ఎందుకా దర్భముల్లును కాల్చి బూడిద చేశారు?" అని చంద్ర గుప్తుడు అడిగాడు.

"ఇది నా కాలిలో గుచ్చుకున్నది. అందు కని దాన్ని భస్మం చేసేశాను," అన్నాడా యువకుడు.

"కాని ఆ భస్మాన్ని నీటిలో కలుపుకుని తాగటంవల్ల ప్రయోజనమేమిటి?" అని చంద్రగుప్తుడు మళ్ళీ అడిగాడు.

"అలా చేయకపోతే నా కోపం నన్నే దహించేస్తుంది," అన్నాడా వింత బ్రాహ్మణ యువకుడు. చంద్రగుప్తుడు అతని అహంకారానికీ, పట్టుదలకూ ఆశ్చర్యపోయీ, అలాటి వాడి అండ తనకు అవసరమని నిశ్చయించుకుని, "మీ పేరేమిటి? ఎక్కడికి వెళుతున్నారు?" అని అడిగాడు.

"నా పేరు విష్ణుగుప్తుడు. అందరూ నన్ను చాణక్యుడంటారు. రాజుల వెంట భోజనంచేసే బ్రాహ్మణులలో అగ్రస్థానం ఆక్రమించి భోజనంచేసే ఉద్దేశంతో వెళుతున్నాను. ఈ ఏర్పాట్లు చేసే శూద్రుడొకడున్నాట్ట. అతన్ని కలుసుకోవాలి," అన్నాడు బ్రాహ్మణ యువకుడు.

"స్వామీ, నేనే ఆ శూద్రుణ్ణి," అన్నాడు చంద్రగుప్తుడు. నందమహారాజు మనవణ్ణి



శూద్రుడన్నందుకు చాణక్యుడు చాలా నొచ్చుకుని, తన పశ్చాత్తాపం తెలుపుకుని, "నీకు నా వల్ల ఏ పని కావాలన్నా చెప్పు, చేసిపెడతాను!" అన్నాడు.

"మా యింటికి ఒకసారి దయచెయ్యండి. అంతే నేను కోరేది," అన్నాడు చంద్రగుప్తుడు. చాణక్యుడు ఆ ప్రకారమే చంద్రగుప్తుడి ఇంటికి వెళ్లి నవనందులు మౌర్య వంశాన్ని నిర్మూలించటానికి చేసిన కుట్రా, చంద్రగుప్తుడు పగ తీర్చుకోవటానికి శపథం చేసి బయటపడిన వైనమూ తెలుసుకున్నాడు.

చాణక్యుడు తరవాత భోజనశాలకు వెళ్ళాడు. తూర్పుముఖంగా తొమ్మిది



విస్తళ్ళు వేసి ఉన్నాయి, వాటిపక్కన బంగారుపాత్రలు పెట్టి ఉన్నాయి. అవి నవనందులు భోజనంచేసే స్థానాలు. వాటికి ఎదురుగా కొన్ని వెండిచెంబులూ, మరొక విస్తరీ ఉన్నాయి. ఇవిగాక ఇంకా అనేక వేల విస్తళ్లు వేసి ఉన్నాయి. ఆ వెండి చెంబులుగల విస్తరి యోగ్యుడైన బ్రాహ్మ డికి అనీన్నీ, మిగతావి సామాన్య బ్రాహ్మ ణులకనీన్నీ తెలుసుకుని చాణక్యుడు ఆ ప్రత్యేక బ్రాహ్మణ స్థానంలో కూచున్నాడు.

కొంతసేపటికి నవనందులు వచ్చి, చాణక్యుణ్ణి చూసి, "ఎవరీ కుర్రవాడు? బయటికి గెంటండి," అన్నారు.

"నా యోగ్యతను పరీకించి నా కన్న యోగ్యుడున్నట్టయితే అతనికి మీరీ స్థానం ఇవ్వవచ్చు," అన్నాడు చాణక్యుడు న్యాయంగా. కాని నందులు అహంకారులై చాణక్యుణ్ణి పిలక పట్టుకుని లాగి భోజన శాలనుంచి బయటికి గెంటారు.

"మిమ్మల్ని సర్వనాశనం చేసి మీ రాజ్యాన్ని శూద్రుడి కివ్వకుండా ఈ పిలక ముడి వెయ్యను. నా యోగ్యత మీరే చూతురుగాని!" అని ప్రతిజ్ఞచేసి చాణక్యుడు అక్కడి నుంచి వెళ్ళిపోయాడు. అనాడే చంద్రగుప్తుడి భవిష్యత్తుకూ, మౌర్యుల




పగ చల్లారటానికి అంకురార్పణ జరిగింది. నగరంలో చాణక్యుడికి ఒక మిత్రు డున్నాడు. అతని పేరు ఇందుశర్మ. అతనికి క్షుద్రవిద్యలు తెలుసు, కొన్ని శక్తులు కల వాడు. "నీవు నందరాజులతోనూ, రాక్షస మంత్రితోనూ సఖ్యంగా ఉన్నట్టు నటిస్తూ నాకు సహాయంచెయ్యాలి," అని చాణక్యుడు ఇందుశర్మను కోరి, ఒప్పించాడు.

ఇందుశర్మ బౌద్ధ మాంత్రికుడి వేషం ధరించి జీవసిద్ధి అని పేరు పెట్టుకుని, తన శక్తిచేత కొందరికి రోగాలు తెప్పించి, వాటిని తానే నయంచేస్తూ, చాణక్యుడు తన మంత్ర శక్తి చేత రోగాలు తెప్పిస్తే తాను వాటిని



నయించేస్తున్నానని ప్రచారం చేసుకో సాగాడు. చాణక్యుడి శపథం విని భయపడు తున్న రాక్షసమంత్రి ఈ జీవసిద్ధిని చేరదీసి, అతని సహాయంతో చాణక్యుడి చర్యలను అరికడదా మనుకున్నాడు.

ఒకనాడు జీవసిద్ధి నవనందులతో, "చంద్రగుప్తుడు ఈ నగరంలో ఉండటం మీకు క్షేమంకాదు. అతన్ని వర్ధమానమనే నగరంలో ఉండే కిరాతరాజు దగ్గిరికి పంపెయ్యండి," అని సలహా చెప్పాడు. నవనందులలాగే చేశారు. చంద్రగుప్తుడు తన కున్నదంతా కిరాతరాజు కిచ్చి అతన్ని తన పక్షం చేసుకున్నాడు.

పాటలీపుత్రానికి ఉత్తరంగా చాలా దూరాన పర్వతప్రాంతాన్ని పర్వతకుడనే మ్లేచ్ఛరాజు ఏలుతున్నాడు. చాణక్యుడు ఆ రాజు వద్దకు వెళ్ళి, "నేను నవనందులను నాశనంచేసి వారి రాజ్యాన్ని చంద్రగుప్తుడి కిస్తానని ప్రతిజ్ఞ చేశాను. అతనికి సైన్యం లేదు. మీరు మీ బలాలను సహాయంచేసి గెలిపించినట్టయితే మీకు అర్ధరాజ్యం వచ్చే టట్టు చూస్తాను," అన్నాడు.

పర్వతకుడు తన తమ్ముడితోనూ, కొడుకుతోనూ రహస్యాలోచన చేశాడు. నందుల అర్ధరాజ్యాన్ని చాణక్యుడి సహాయంతో గెలుచుకున్నాక, చంద్రగుప్తుణ్ణి బలహీనుణ్ణి చేసి పూర్తిరాజ్యమే పుచ్చుకో వచ్చునని వారు నిశ్చయించుకుని చాణక్యుడితో సరేనన్నారు.

ఒక పక్కనుంచి పర్వతరాజు సేనలూ, మరొక పక్కనుంచి చంద్రగుప్తుడూ, కిరాత రాజు సేనలూ పాటలీపుత్రంపై వచ్చి పడ్డాయి. నవనందులు పర్వతరాజు సేన లతో యుద్ధం చేయబోయి ఆ యుద్ధంలో మరణించారు. రాక్షసమంత్రి చంద్రగుప్తుడి సేనలతో యుద్ధంచేయ వచ్చాడు. చంద్ర గుప్తుడు రాక్షసుడికి నమస్కారంచేసి, "నా రాజ్యభాగం నాకిప్పించండి. యుద్ధం మానే

స్తాను," అన్నాడు. కాని రాక్షసుడు అతన్ని దుర్భాషలాడాడు. ఇంతలో నవనందులు చచ్చిపోయినట్టు తెలిసి రాక్షసుడు యుద్ధం మాని నగరంలోకి వెళ్ళిపోయాడు.

నగరం రాజుల చావుతో అరాజకమై పోయింది. పురజనులు చాణక్యుణ్ణి నగరం రక్షించమని కోరారు. ముసలిరాజు అడవికి పోతే అలాగే చేస్తానన్నాడు చాణక్యుడు. అలాగే చెయ్యమని వృద్ధరాజుకు రాక్షస మంత్రి సలహా ఇచ్చాడు.

తరవాత రాక్షసుడు చంద్రగుప్తుణ్ణి చేరి, "ఇప్పుడు సగంరాజ్యం నీది; సగంరాజ్యం పర్వతకుడిది. నాకు పర్వతకుడి వద్ద మంత్రిగా ఉండటం ఇష్టంలేదు. నీ వద్దనే ఉంటాను," అన్నాడు. చాణక్యుడి సలహాతో చంద్రగుప్తుడు అందుకు సమ్మతించాడు.

అయితే చంద్రగుప్తుడిపట్ల రాక్షసుడిబుద్ధి ఏమీ మారలేదు. అతన్ని చంపించి నందుల పగ తీర్చటానికి రాక్షసుడు మనుషులను నియోగించాడు.

వనంలో ఉంటున్న ముసలిరాజు చంద్రగుప్తుడికి విష ఫలాలు పంపాడు. చారుల ద్వారా ఈసంగతి తెలిసి చాణక్యుడు వాటిని ఆ ముసలి రాజుకే తిప్పి పంపాడు. ముసలి రాజు వాటిని తిని చచ్చిపోయాడు.



ఇది రాక్షసుడికి మరొక దెబ్బ. అయినా అయిన చాణక్యుణ్ణి నిర్మూలించే ప్రయత్నం మానక, రహస్యంగా పర్వతకుడితో కూడా మంతనాలు సాగించాడు.

బౌద్ధ మాంత్రికుడి వేషంతో రాక్షస మంత్రిని మంచిచేసుకున్న చాణక్యుడి మిత్రుడు తన మంత్రశక్తిచేత అతి లావణ్యవతి అయిన విషకన్యను సృష్టించి, దాన్ని రాక్షసుడికి చూపి, "దీనిని ఆలింగనం చేసుకున్న వాడు తక్షణం చచ్చిపోతాడు, మరుక్షణం ఇది అదృశ్యమైపోతుంది," అని ఆ విషకన్యను రాక్షసుడివద్ద విడిచి వెళ్లాడు. అయితే అతను ఈ విషకన్యను



రాక్షసుడి పరం చేసినమాట ఆ రోజునే చాణక్యుడికి చెప్పాడు.

కొద్ది రోజులు పోయినాక రాక్షసుడు చాణక్యుణ్ణి పిలిచి, "అపూర్వ సౌందర్యవతి అయిన కన్య ఒకతె లభించింది. ఆమెను చంద్రగుప్త మహారాజుకు కానుకగా ఇవ్వాలనుకుంటున్నాను. మీరు తీసుకుపోతారా ?" అని అడిగాడు.

చాణక్యుడా విష కన్యను వెంటబెట్టుకుపోయి నిండుకొలువులో, రాక్షసుడు వింటుండగానే, ఆ కన్యను పర్వతకుడికి బహుమానం చేస్తానని సూచించాడు. రాక్షసుడు వద్దనటానికి వీలులేని పరిస్థితి. అందుచేత ఆయనకూడా అలాచేస్తే బాగుంటుందని అనవలసి వచ్చింది. తరవాత విష కన్యను పర్వతకుడి వద్దకు పంపారు. మర్నాడు పర్వతకుడు చచ్చి ఉన్నాడు; విషకన్య జాడలేదు!

తనకు ప్రమాదం కలగబోతున్నదని గ్రహించి రాక్షసుడు ఆ రాత్రే తన కుటుంబాన్ని తన స్నేహితుడైన చందనదాసు ఇంట ఉంచి నగరం విడిచి వెళ్ళి పోయాడు.

పర్వతకుడి హత్యకు కారకుడు రాక్షస మంత్రేనని అందరూ అనుకున్నారు. అదే ప్రకారం చాటింపుకూడా వేశారు. రాజద్రోహిగా అతన్ని శిక్షించటానికి మాత్రం ఆయన దొరకలేదు.

చాణక్యుడు ఒక మనిషిని పర్వతకుడి కొడుకు వద్దకు పంపి, "చాణక్యుడే నీ తండ్రిని చంపించాడు. నీ విక్కడ ఉన్న పక్షంలో నిన్నుకూడా చంపెయ్యగలడు," అని చెప్పించాడు.

ఈ మాట విని బెదిరి పర్వతకుడి కొడుకు తన దేశానికి వెళ్ళిపోయాడు.

రాక్షసుడు ఈ వార్త విని పర్వతకుడి కొడుకు ఉండే చోటికి వెళ్ళి, "చంద్రగుప్తుణ్ణి చంపి రాజ్యమంతా ఏలుకుందువుగాని, సైన్యం సిద్ధంచెయ్యి. నేను నీకు

మంత్రిగా ఉంటాను," అన్నాడు. అందుకు పర్వతకుడి కొడుకు ఒప్పుకున్నాడు.

రాక్షసుడు పారిపోయినా నగరంలో రాక్షసుడి భృత్యులు చంద్రగుప్తుణ్ణి చంపే ప్రయత్నంలోనే ఉన్నారు. చంద్రగుప్తుడు నగర ప్రవేశం చేసేసందర్భంలో ఉత్తర గోపుర ద్వారంవద్ద దారువర్మ అనే వాడు పెద్ద ఎత్తున అలంకరణలు చేస్తూ ఉండటం చూసి చాణక్యుడు శంకించి, చంద్రగుప్తుడు రావలిసిన సమయానికి అతని ఏనుగు మీదనే పర్వతకుడి తమ్ముణ్ణి పంపాడు. సరిగా ద్వారం కిందికి వచ్చేసరికి ఒక ఆయుధం పైనుంచి పడి మూపటివాణ్ణి చంపింది. మరుక్షణం దారువర్మ పైనుంచి దూకి పర్వతకుడి తమ్ముణ్ణి కత్తితో పొడిచి చంపేశాడు. అది అర్ధరాత్రివేళ కావటం చేత తాను ఎవరిని చంపుతున్నదీ కూడా ఆ దుర్మార్గుడు చూడలేదు.

దారువర్మను మ్లేచ్ఛులు పట్టుకుని అక్కడే చంపారు.

మరొకసారి ఒక వైద్యుడు చంద్రగుప్తుడికి ఔషధం ఇస్తూ అందులో విషం కలిపాడు. చాణక్యుడు పక్కనే ఉండి ఆ వైద్యుడిచేత ఆ ఔషధం కొంత తినిపించాడు. వైద్యుడు చచ్చాడు.



ఈ విధంగా చాణక్యుడు చంద్రగుప్తుణ్ణి వెయ్యి కళ్ళతో కాపాడటమేగాక తన చారులను నగరమంతటా తిప్పి అన్ని రహస్యాలూ తెలుసుకుంటూ ఉండేవాడు. ఈ చారులలో ఒకడు ఒకసారి చందనదాసు ఇంటికి వెళ్ళి అక్కడ యమలోక పటాన్ని చూపుతూండగా ఒక కుర్రవాడు లోపలినుంచి వచ్చాడు. అప్పుడొక స్త్రీ వచ్చి వాణ్ణి లోపలికి తీసుకుపోయింది. ఆ సమయంలో ఆమె చేతినుంచి ఒక ఉంగరం కింద పడింది. ఆ ఉంగరం చారుడిద్వారా చాణక్యుడికి చేరింది. దాన్ని చూస్తూనే అది రాక్షసుడి ముద్రిక అని చాణక్యుడు తెలుసుకున్నాడు. ఇకనుంచి

ఆయన రాక్షసమంత్రికీ చంద్రగుప్తుడి శత్రువులకూ మధ్య విభేదాలు పెట్టి, రాక్షసుణ్ణి చంద్రగుప్తుడికి సుముఖుణ్ణిగా చేసుకునేటందుకు పథకం వేశాడు.

చాణక్యుడి మనుషులు కొందరు చంద్రగుప్తుడి శత్రువులలాగా నటిస్తూ రాక్షసుడు ఉంటున్న మ్లేచ్ఛరాజ్యానికి వెళ్ళారు. రాక్షసుడి భృత్యులైన కొందరికి శిక్షలు విధించి, వారిని శిక్ష అనుభవించకుండా విడిపించి, రాక్షసుడి వద్దకు తీసుకుపోవటానికికూడా చాణక్యుడు కొందరిని నియమించాడు. వారిలో ఒకడు ఒక ఉత్తరం తీసుకున్నాడు. అందులో రాక్షసుడు చంద్రగుప్తుడి కొక రహస్యలేఖ రాసినట్టుగా ఉన్నది. ఆ లేఖకు చాణక్యుడు రాక్షసుడి ముద్రిక వేశాడు.

చాణక్యుడు తరవాత చంద్రగుప్తుడితో వైరం తెచ్చుకునేవాడిలాగా నటించాడు. ఇద్దరూ బహిరంగంగానే ఘర్షణపడసాగారు. ఈ వార్తకూడా మ్లేచ్ఛరాజ్యానికి చేరింది. చాణక్యుడు సృష్టించిన దొంగ ఉత్తరం పర్వతకుడి కొడుకు చేతికి చిక్కింది. దానిని రాక్షసుడే రాయించాడనీ, చాణక్యుడికీ చంద్రగుప్తుడికీ చెడినమీదట చాణక్యుడి స్థానం తాను ఆక్రమించటానికి రాక్షసుడు యత్నిస్తున్నాడనీ అతను నమ్మాడు. విషకన్యయొక్క సృష్టికి కారకుడు రాక్షసుడేనని కూడా అతనికి స్పష్టంగా తెలిసిపోయింది.

రాక్షసుడు అనుకున్నదంతా తారుమారయింది. ఆయన తన స్వదేశానికి తిరిగి వచ్చాడు. చాణక్యుడి సలహాపై చంద్రగుప్తుడాయనను సమస్త గౌరవాలతో సభకు రప్పించాడు. చాణక్యుడూ చంద్రగుప్తుడూ కూడా ఆయనను మంత్రిలాగే చూశారు. రాక్షసమంత్రి మనసు ఇంతకాలానికి మారిపోయింది. చాణక్యుడి యత్నాలు ఫలించాయి. చంద్రగుప్తుడు తన దాయాదుల రాజ్యంతోపాటు వారి మంత్రినికూడా జయించుకున్నాడు.





# కళ్ళువిప్పిన యువరాజు

పూర్వం భాగ్యపతి నగరాన్ని సౌభాగ్యవర్మ అనేరాజు పాలిస్తూ ఉండేవాడు. ఆయన పరిపాలన ధర్మ పరిపాలన. ఆయన కింద ప్రజలు ఎలాటి కష్టాలూలేక హాయిగా బతుకుతూ తమ రాజే తమపాలిటి దైవం అని నమ్మేవారు.

సౌభాగ్యవర్మకు లేకలేక అరవయ్యో యేట ఒక కొడుకు కలిగాడు. వాడికి సుందరుడని పేరు పెట్టుకున్నారు. లేకలేక కలిగిన ఆ కొడుకును చూసుకుని ముసలి రాజుకు ఎంత ఆనందం కలిగేదో, వాడి భవిష్యత్తు గురించి ఆలోచిస్తే అంత విషాదమూ కలిగేది. ఎందుకంటే సుంద రుడు రాజ్యార్హుడయేదాకా తాను జీవించి ఉండని పక్షంలో, వాడికి పదహారేళ్లు నిండే దాకా ప్రధాన మంత్రిని రాజప్రతినిధిగా ఉంచవలిసివస్తుంది. ఆ తరవాత సుందరు డికి రాజ్యమూ, ప్రాణాలూకూడా దక్క కుండా పోవచ్చు. ఈ చింత ముసలి రాజును నిత్యమూ వేధించేది.

ఆయన భయపడినట్టే సుందరుడు పదేళ్ల వాడై ఉండగా రాజుకు జబ్బు చేసింది. అది చికిత్సలకు లొంగకపోగా రోజురోజుకూ ముదరసాగింది. తనను మృత్యువు చేర వస్తున్నదని సౌభాగ్యవర్మ గ్రహించి, తనను చిన్నతనం నుంచీ ప్రాణంలాగా కనిపెట్టు కుని ఉండిన "తాత"ను పిలిపించి, ఆయనతో రహస్యంగా ఇలా చెప్పాడు:

"తాతా, నేను త్వరలోనే పోతానని తోస్తోంది. సుందరుడు పసివాడు. ఒకవేళ పట్టం కట్టినా రాజ్యం విలలేదు. అందుచేత వాడికి పదహారేళ్లు నిండేదాకా మహామంత్రే రాజ్యభారం చూడక తప్పదు. మహామంత్రి రాచకార్యాలు నిర్వహించటంలో సమర్థుడే, కాని ఆరేళ్లు రాజ్యవైభవం రుచిమరిగాక అతడి మనసు ఎలా మారుతుందో చెప్పలేం.

సి. మాధవరావు



సుందరుడికి రాజ్యం దక్కకపోయినా నాకు విచారం లేదు; వాడి ప్రాణానికి అపాయం రాకుండా ఉండటం అతి ముఖ్యం. నాకు నీకన్న నమ్మదగినవాడు లేడు. అందుచేత సుందరుడి ప్రాణాలు కాపాడేభారం నీపైన వేస్తున్నాను. ఇందుకుగాను రాజాంతఃపురం మీద నీకు సమస్తహక్కులూ ఇస్తున్నాను. వాటిని మహామంత్రికూడా జవదాటడానికి వీల్లేదు. మిగిలిన రాజకీయాల ప్రసక్తి నీకు వద్దు. సుందరుడు రాజ్యార్హుడైనాక మహమంత్రి తానై వాడికి పట్టాభిషేకం చేస్తే సరేసరి, లేకపోతే సుందరుడు తన స్వశక్తితో రాజ్యం సంపాదించుకుంటాడు, లేదా రాజ్య



భ్రష్టుడవుతాడు." తరవాత సౌభాగ్యవర్మ మంత్రిని పిలిపించి, "మహామంత్రీ, నాకు కాలం తీరిపోయింది. సుందరుడు పసివాడు. వాడికి పదహారేళ్లు నిండేదాకా రాజ్యపరిపాలన మీరే సాగించి, ఆ తరవాత వాణ్ణి యథావిధిగా రాజ్యాభిషిక్తుణ్ణి చేసి, వాణ్ణి కనిపెట్టి ఉంటూ రాజ్యం చేయించండి. అంతదాకా సుందరుణ్ణి తాత అధీనంలో ఉంచుతాను. తాతకు అంతఃపురంపైన సర్వాధికారాలు ఇచ్చేశాను. సుందరుడి పెంపకం గురించి మీకెలాటి శ్రమా ఉండదు," అని చెప్పాడు.

తరవాత సౌభాగ్యవర్మ కన్ను మూశాడు. ఆయన మృతికి కంట తడిపెట్టనివాడులేడు. మహామంత్రి మహారాజయాడు. వెంటనే పరిపాలనలో అనేక మార్పులు జరిగాయి. అవి ప్రజలకు అనుకూలమైనవికావు. కొత్త మహారాజు ప్రవేశపెట్టిన పద్ధతులను ఆక్షేపించటం ప్రమాదకరమని ప్రజలు తెలుసుకుని పరిస్థితులకు తల ఒగ్గారు.

ఇక తాత సుందరుణ్ణి కంటిని రెప్పలాగా కాపాడసాగాడు. ఎటువంటి పరిస్థితిలోనూ సుందరుడు అంతఃపురం దాటి వెళ్లటానికి వీల్లేదు. సుందరుడు తినే ప్రతి వస్తువునూ తాత స్వయంగా ముందుగా రుచి చూడాలి. తాత సుందరుడికి చదువు చెప్పటానికి





సమర్థులైన గురువులను ఏర్పాటుచేశాడు; వాడితో కలిసి చదువుకునేటందుకు ఇరవై మంది కుర్రవాళ్లను తానే ఏరాడు. ఆ కుర్ర వాళ్ళు రోజూ అంతఃపురానికి వచ్చి, సుందరుడితోబాటు విద్యాభ్యాసం చేసి వెళ్ళి పోతూండేవారు.

ఆరేళ్ళు గడిచాయి. సుందరుడికి పదహా రేళ్ళు నిండాయి. రాజప్రతినిధిగా ఉండి పరిపాలన చేస్తున్న మహామంత్రి సుందరు డికి రాజ్యాభిషేకం చేసే ప్రయత్నాలేమీ చేయులేదు గాని సుందరుణ్ణి బతికి ఉండ నిస్తే తనకు పక్కలో బల్లెంగా ఉండవచ్చు నని ఆలోచించి, సుందరుడి తల తెచ్చిన వారికి మంచి బహుమాన మిస్తానని తన సన్నిహితులతో అన్నాడు.

అయితే తాత సుందరుణ్ణి కంటిని రెప్ప లాగా అహోరాత్రాలు కాపాడుతూ, అంతః పురందాటి వెళ్ళనివ్వకపోవటంచేత ఎటు వంటి ప్రమాదమూ జరగలేదు.

మరి రెండేళ్ళు గడిచాయి. మహామంత్రి ఒక కన్యను ఏరి సుందరుడికిచ్చి వివాహం చేశాడు. కాని తాత తన ధర్మం తాను ధృఢంగా నెరవేర్చేవాడు కావటంచేత ఆ భార్యాభర్తలను ఒక్క క్షణంపాటు కూడా ఒకచోట ఒంటరిగా ఉండనివ్వలేదు.



భార్యాభర్తలు తన సమక్షంలోనే మాట్లాడుకో వాలి. రాత్రివేళ ఎవరి గదులలో వారు పడుకోవాలి. సుందరుడికి అతడి భార్య తాంబూలంకూడా ఇవ్వటానికి వీల్లేదు.

తాత చేసిన ఈ చండశాసనం సుంద రుడికి చిరాకు పుట్టించింది. కాని అతను తాత గీసిన గిరి దాటకుండా మనులు కోవటం పసితనం నుంచీ నేర్చుకున్నవాడు కావటంచేత, పెళ్లి అయికూడా బ్రహ్మచారి జీవితం గడుపుతూ వచ్చాడు.

కాలం గడుస్తున్నకొద్దీ సుందరుడికి రాజ్యాభిషేకం జరిగే అవకాశం సన్న గిల్లింది. ఈ విషయమై ప్రజలు అసంతృప్తి



చెందికూడా ఏమీ చేయలేక ఊరుకున్నారు. తాత సుందరుడి ప్రాణానికి తన ప్రాణం అడ్డు వెయ్యగలవాడే తప్ప, అతడికి రాజ్యం ఇప్పించగల సమర్థుడు కాడు. ఇక సుంద రుడికి రాజ్యకాంక్షకూడా లేదు. ఎనిమి దేళ్ళుగా అంతఃపురంలో ఖైదీలాగా ఉండి పోవటంచేత అతనికి బయటి ప్రపంచమే తెలియదు. అతనికి ఆనందమేమైనా ఉంటే అది అతని సహాధ్యాయులతో కబుర్లు చెప్పు కోవటంలో మాత్రమే ఉండేది. వారు అప్పు డప్పుడూ అంతఃపురానికి వచ్చి తాతే అను మతితో అక్కడ కొంతసేపు గడిపి మళ్ళీ ఇళ్ళకు వెళ్ళిపోతూ ఉండేవారు.

ఇలాగే ఒక నాటి సాయంకాలం సుంద రుడు తన మిత్రులతో చల్లగాలి సేవించ టానికి అంతఃపుర భవనం పైభాగానికి వెళ్ళాడు. దాని పైనుంచి నగరమంతా కని పిస్తుంది. సూర్యాస్తమానమై సంధ్యాకాంతి ఇంకా మిగిలి ఉన్నది. ఆ కాంతిలో తూర్పు దిశగా అతని కొక తెల్లని పెద్ద భవనం కని పించింది. సుందరుడు ఊసుపోకకు తన దగ్గిర వున్న మిత్రులతో, "ఆ భవనం ఎవరిదో?" అన్నాడు.

వెంటనే వాళ్ళు, "న్యాయంగా అది నీదే. కాని మహామంత్రి నీకు రాజ్యాభి షేకం చెయ్యక, తానే దాన్ని పట్టుకుని



వెళ్ళాడుతున్నాడు. అది రాజ్యభవనం. అందులోనే ఆయన రోజూ కొలువుతీరి సభ చేస్తూ అధికారం వెలగబెడతాడు. రెండేళ్ళ క్రితమే అక్కడి సింహాసనం మీద నీవు కూర్చోవలిసింది; ఇక కూర్చునే ఆశకూడా లేదు. పైపెచ్చు ఈ మహామంత్రి నుంచి నీకు ప్రాణాపాయంకూడా ఉన్నదనుకో వచ్చు. నీకు రాజ్యం ఇవ్వనివాడు నీప్రాణం మటుకు దక్కనిస్తాడా?" అన్నారు.

ఈ మాటలు సుందరుడి హృదయంలో ములుకుల్లాగా నాటుకున్నాయి. రెండేళ్ళుగా తన హక్కును తాను విడిచిపుచ్చి ఆడదాని లాగా చేతులు కట్టుకు కూర్చున్నందు కతను చాలా సిగ్గుపడ్డాడు. ప్రపంచం దృష్టిలో తనకు మానమే లేకుండా పోయింది; ప్రాణాలు ఉంటే ఎంత, లేకపోతే ఎంత?

ఆ రాత్రి చాలాసేపు కబుర్లు చెప్పుకుని తన మిత్రులు ఇళ్ళకు బయలుదేరేటప్పుడు సుందరుడు వారితో, "మీరందరూ రేపు ఉదయం ఇక్కడికి రండి. మనం గుర్రాల మీద నాలుగు బజార్లూ తిరిగి వద్దాం!" అన్నాడు. వారు సరేనని వెళ్ళిపోయారు.

సుందరుడు తెల్లవారు ఝామునే లేచి తాతతో, "తాతా, నేనూ, నా మిత్రులూ అలా నాలుగు వీధులూ తిరిగివస్తాం. గుర్రాలు సిద్ధం చేయించు," అన్నాడు.






యువరాజులో కలిగిన ఈ మార్పుకు తాత సంతోషించాడు. ఆయన యువరాజు ఊరేగటానికి కావలిసిన ఏర్పాటులన్నీ చేశాడు. సుందరుడి మిత్రులు ఇరవైమందీ వచ్చారు. అతను వారందరితోబాటు గుర్రం ఎక్కి బయలుదేరాడు. తాత మరొక గుర్రం మీద కత్తి దూసి అంగరక్షకుడుగా బయలుదేరాడు. ఈ ఊరేగింపుకు ముందూ వెనకా సాయుధ భటులు నడిచారు.

తాను తన బలగంతో వీధులవెంట పోతుంటే జనం తనకేసి సంతోషంగా చూడటమూ, తనపట్ల ఎంతో అభిమానమూ, భక్తీ ప్రదర్శించటమూ సుందరుడు గమనించాడు. వాళ్ళు నాలుగు వీధులూ తిరిగి రాజ్యసభ సాగుతున్న తెల్ల భవనానికి వెళ్ళారు. యువరాజును చూడగానే సభికులందరూ లేచి ఎంతో భక్తితో నమస్కారాలు చేశారు.

సింహాసనం మీద కూచుని ఉన్న మహామంత్రి మాత్రం లేవలేదు.

సుందరుడు వెంటనే వెనక్కు తిరిగి వచ్చి గుర్రమెక్కి తన అంతఃపురానికి వచ్చేశాడు. అతని మిత్రులు వెళ్ళిపోయాక అతను చాలాసేపు దీర్ఘంగా యోచించాడు. ప్రజలకు తనపైన అనురాగం ఉన్నట్టే కనబడుతున్నది, కాని వారికి రాజప్రతినిధి అయిన మహామంత్రి పైన ఎటువంటి భావం ఉన్నదో తెలియలేదు. నిండు సభలో ఆయన తనను అమర్యాదగా చూశాడంటే ఆయనకు ప్రజలలో కొంత బలం ఉండవచ్చు. నగరంలో గల వాస్తవ పరిస్థితులు తెలుసుకోవాలని సుందరుడికి గాఢమైన కోరిక కలిగింది. తాను యువరాజుగా కాక సామాన్య మానవుడిలాగా ఊరంతా తిరగగలిగితే బాగుండును. తాను ఒంటరిగా బయటికి వెళ్ళటానికి తాత సుతరామూ ఒప్పడు; పెద్ద బలగాన్ని తీసుకుని తాను కూడా వస్తాడు. అది నిష్ప్రయోజనం.

ఆ రాత్రి తాత నిద్రించే సమయంలో తాను బయటికి పోవాలని సుందరుడు తీర్మానించుకున్నాడు. కాని అదికూడా సాధ్యపడే సంగతికాదు. ఎందుకంటే రాత్రివేళ అంతఃపుర ద్వారాలన్నీ భద్రంగా తాళాలు వేసి ఉంటాయి. ఏదైనా తాడు సంపాదించి దాని సహాయంతో వీధిలోకి దిగటానికి అతను నిశ్చయించుకున్నాడు. ఆ రాత్రి తాత వెళ్ళి పడుకున్నాక సుందరుడు తాడు కోసం వెతుకుతూ భవనమంతటా కారాడాడు. చివరకు అతను తన భార్య పడుకునే గదికికూడా వెళ్ళాడు. అతని భార్య పక్కమీద నిద్రపోతున్నది. కాని అతి విచిత్రంగా ఆ గదిలోనే ఒక మూల అతని కొక తాటి నిచ్చెన కనిపించింది.

"ఈ తాటి నిచ్చెన ఇక్కడ ఎందుకున్నది?" అని ఒక్క క్షణంపాటు ఆశ్చర్యపోయి, తరవాత తన కోరిక నెరవేరింది గదా అని తృప్తిపడి, దాని సహాయంతో అతను ఆ అపరాత్రివేళ కోటగోడ మీది నుంచి వీధిలోకి దిగాడు.

నగరం ప్రశాంతంగా ఉన్నది. ఎక్కడా జనసంచారంలేదు. అతను కొంతదూరం వెళ్ళి, ఒక ఇంట్లో ఏదో సంభాషణ విన పడగా, అది వినాలనే ఉద్దేశంతో ఇంటి



వెలపల ఉన్న అరుగుమీద కూచున్నాడు. లోపల ఒక బ్రాహ్మడూ, ఆయన భార్యా మాట్లాడుకుంటున్నారు.

"ఏం చేస్తాం? ముసలి రాజుగారు బతికిఉండగా మనకేలోటూ ఉండేదికాదు. ఆయన యోగ్యత గుర్తించ గలవాడు కనక మనకు దారిద్ర్యబాధ లేకుండా చేశాడు. ఈ మహామంత్రి సింహాసనం ఎక్కాక అటువంటిదేదీ లేకుండాపోయింది. పోనీ యువరాజు వచ్చాక మన కష్టాలు గట్టెక్కుతాయి గదా అనుకుంటే ఆ ఆశకూడా అడుగంటింది. ఆ కుర్రవాడు రాజ్యం అడిగేటట్టూ లేడు, ఈ నీచుడు ఇచ్చేటట్టూ లేడు!

ఇవాళ యువరాజు సభలోకివస్తే ఆ దుర్మార్గుడు లాంఛనగానైనా లేవలేదుట. ఇక మనకీ దేశం అచ్చిరాదు, మరెక్కడికైనా పోదాం," అంటున్నాడు బ్రాహ్మడు.

ఈ మాటలు వింటుంటే సుందరుడికి చెవులలో సీసం కరిగించి పోసినట్టయింది. "ఛీ, ఇక ఉపేక్షించరాదు. రాజ్యం పుచ్చుకోవలిసిందే. ఈ బ్రాహ్మడిలాగా బాధపడుతున్నవారు నగరంలో ఇంకా ఎందరున్నారో?" అనుకుంటూ సుందరుడు అక్కడినుంచి కదిలాడు.

త్వరలోనే అతను నగరపు తూర్పు ద్వారం చేరవస్తుండగా సన్నగా తుంపర పడసాగింది. సుందరుడు ఆ సమీపంలోనే ఉన్న వినాయకుడి గుడిలోకి దూరాడు. మరికొద్దిసేపటికి జల్లు కాస్త పెద్దదయింది. ఎవరో ఇద్దరు మనుషులు గుడిలోకి వచ్చారు. వారి కంట పడకుండా ఉండటానికిగాను సుందరుడు చప్పున వినాయకుడి విగ్రహం వెనక్కు వెళ్ళాడు.

ఆ వచ్చిన మనుషులు ద్వారం వెలపల మైదానంలో గొర్రెలను మేపుకునేవాళ్ళు. వాళ్ళు గుడిలోకి చేరి అదీ ఇదీ మాట్లాడుకో సాగారు. మధ్యలో ఒకడు రెండో వాడితో, "విన్నావా? ఇంతకాలం అంతఃపురాన్ని విడిచిరాని యువరాజు ఇవాళ పెద్దపులి



నోట్లో తల దూర్చాట్ట! అదృష్టవంతుడు, ప్రాణాలతో బయటపడ్డాడు. ఆ అబ్బాయి తల తెచ్చినవాళ్లకి మహామంత్రి కోటివరహా లిస్తాడని పుకారు," అన్నాడు.

"వాడు ఎంత పాపానికైనా సిద్ధమే. వాణ్ణి పట్టపగ్గాలు లేకుండా ఉన్నాయి. అందుకే జనాన్ని తెగకాల్చుకు తింటు న్నాడు!" అన్నాడు రెండోవాడు.

అంతలో దూరాన బండి చప్పుడు విని పించింది.

"అడుగో వాడే వస్తున్నట్టుంది. రోజూ ఈ వేళప్పుడే రాసక్రీడలకు బయలుదేరు తాడు. వాన తగ్గింది. మనం పోదాంపద," అనుకుని గొర్రెల కాపర్లు గుడిలో నుంచి గబగబా వెళ్ళిపోయారు.

సుందరుడు విగ్రహం చాటునుంచి ఇవతలికి వచ్చి బండి చప్పుడు ఆలకించాడు. అది త్వరలోనే చేరవచ్చింది. బండి గుడిని దాటి కాస్త ముందుకు వెళ్ళగానే సుంద రుడు దాని వెనక మెట్లుమీద ఎక్కి కూచున్నాడు.

బండిలో మహామంత్రీ ఆయన ముఖ్య మంత్రీ ఉన్నారు. వారు మాట్లాడుకుంటు న్నారు. "మన మనుషులంతా ఎక్కడ చచ్చి నట్టు? వాడు పట్టపగలు వీధులన్నీ తిరిగి వస్తే ఏమూలనుంచి ఒక బాకు విసిరినా పని



తిరిపోయి ఉండేదిగదా! వాణ్ణి ప్రాణాలతో ఇంటికి పోనిచ్చారే!" అన్నాడు మహా మంత్రి. ఆయన మాట్లాడుతున్నది తనను గురించేనని సుందరుడికి అర్థమయింది.

"మహారాజా, యువరాజు బయటికి వస్తారని ముందుగా ఎవరికీ తెలీదు. దానికి తగ్గట్టు అతని చుట్టూ మిత్రులున్నారు. అతని పక్కనే తాత ఉన్నాడు. ముందూ వెనకా భటులున్నారు. అదీగాక, నాదొక మనవి. ఆ పిల్లవాడి ప్రాణాలు తీయవలిసిన అవసరం మనకేముంది? రెండేళ్ళుగా వాడు రాజ్యం అడగలేదు. ఇక అడగబోడు. వాణ్ణి చంపటంవల్ల నష్టం బోలెడంత ఉన్నది. ముసలి రాజుగారంటే ప్రజలకు దేవుడే. అటువంటివాడి కొడుకును హత్య చేశామంటే ప్రజలు రెచ్చిపోవచ్చు," అని ముఖ్యమంత్రి విన్నవించుకున్నాడు.

"నీకు కొంచెంకూడా బుద్ధిలేదు. వాడు బతికి ఉన్నంతకాలమూ ప్రజలు వాడిపైన లేనిపోని ఆశలు పెట్టుకుంటారు. వాడు పోయాడంటే కుక్కిన పేలలాగయిపోతారు. వాడి తల తీసే భారం ఇక నీపైనే పెడుతున్నాను. ఆ పని వెంటనే చెయ్యలేకపోయావో నీ తల తప్పక తీస్తాను," అన్నాడు మహామంత్రి.

"క్షమించండి, మహారాజా! నాకు ఒక్క వారం గడువిస్తే తమ ఆజ్ఞ నెరవేర్చుతాను!" అన్నాడు ముఖ్యమంత్రి.

తరవాత వారు ఇతర విషయాలను గురించి మాట్లాడుకున్నారు. ఈ సంభాషణ విన్నమీదట తాత తన క్షేమంకోసం అలాటి నియమాలు ఎందుకు చేశాడో సుందరుడికి అర్థమయింది. మహామంత్రి ప్రజాకంటకుడు, దుర్మార్గుడు; ఆయన నుంచి తాను ఎంత శీఘ్రంగా రాజ్యం పుచ్చుకుంటే అంత మంచిదనికూడా అతను నిర్ధారణ చేసుకున్నాడు.

—[వచ్చే సంచికలో ముగింపు]






ఒకానొక దేశంలో రసార్ణవుడనే ఘనవైద్యుడుండేవాడు. ఆయనది అమృతహస్తం. గొప్ప అనుభవం కలవాడు. ఆయన చేతిలో కుదరని వ్యాధి లేదు.

ఒకసారి ఆయనకొక ఆలోచన కలిగింది: "ఎన్నో సంవత్సరాలుగా గురుశుశ్రూష చేసీ, శాస్త్రాలు చదివీ, అనుభవం గడించీ ఇంత కీర్తీ, ధనమూ సంపాదించాను. అనుశ్రుతంగా వచ్చే విద్య కనుక ఈడు తియ్యకుండా నా కుమారుడు వైద్యం సాగిస్తున్నాడు. కాని, నాడి పరీక్ష చెయ్యాలన్నా, అసాధ్యరోగాలకు చికిత్స చేయాలన్నా, వాడికి కష్టసమస్య అవుతుంది. వ్యాధినిబట్టి మందు నిర్ణయించటానికి శాస్త్రజ్ఞానం చాలదు. దీనికి దైవానుగ్రహం ఉండాలి," అనుకున్నాడు.

ఈ వుద్దేశం కలగ్గానే రసార్ణవుడు తన వృత్తి కుమారుడు సోమదత్తుడికి వప్పగించి, అరణ్యాలకు పోయి, తపస్సు ప్రారంభించాడు.

మూడు సంవత్సరాల తరవాత ఒకనాడు అశ్వినీ దేవతలు ఆయనకు ప్రత్యక్షమై, కోరిక ఏమిటో చెప్పమన్నారు. అందుకు రసార్ణవుడు, "సమస్త వ్యాధులూ నయమయే ఒకే ఒక్క సాధనం నాకు అనుగ్రహించండి!" అన్నాడు.

అప్పుడు అశ్వినీ దేవతలు అతనికొక విత్తన మిచ్చారు. "దీన్ని పాతిపెట్టు. ఈ వృక్షం తాలూకు ఆకుల రసం వాడితే సమస్త రోగాలూ కుదురుతాయి. దీని ఫలం సేవిస్తే స్వర్గసౌఖ్యం లభిస్తుంది. కానీ, స్వార్థం విడిచి లోకోపకారం కోసమే దీన్ని ఉపయోగించాలి," అని చెప్పి అదృశ్యమయ్యారు. రసార్ణవుడు సంతోషించి, వెంటనే ఇంటి పెరట్లో, దేవత లిచ్చిన విత్తనం పాతిపెట్టాడు. చూస్తూండగానే అది మొలకెత్తి

ఎం. విశ్వేశ్వరరావు



వృక్షమై, ఆకులతో నిండిపోయింది. దాని చిటారు కొమ్మని ఒకే ఒక్క ఎఱ్ఱటి పండున్నది.

ఈ చెట్టు ఆకులతో రసార్ణవుడు వైద్యం చేస్తూ, మునుపటికంటె ఎక్కువగా ఖ్యాతీ, ధనమూ సంపాదించాడు. అతని కుమారుడైన సోమదత్తుడికి కూడా ఈ చెట్టు ఆకులను గురించి మాత్రమే తెలుసు. పైన వుండే పండును గురించి ఎవరేనా అడిగితే, అది విషఫలం అని రసార్ణవుడు చెబుతూండేవాడు. సోమదత్తుడికీ ఈ సంగతే తెలుసు.

ఇలా ఉండగా, రసార్ణవుడికి వృద్ధాప్యం వచ్చేసింది. మరణ సమయమందు కొడు



కును దగ్గరకు పిలిచి, "నాయనా! – నేను కష్టపడి సంపాదించిన ఈ వృక్షం తాలూకు మహిమ నీకు తెలుసుకదా! వైద్య వృత్తి సాగించి, అందరకూ పూర్ణారోగ్యం కలగజేసి, నువ్వూ సుఖంగా కాలక్షేపం చెయ్యి. మన కుటుంబం పేరు నిలబెట్టు," అని చెప్పాడు.

అప్పుడు సోమదత్తుడు, "నాయనా!— ఆకుల పసరే ఇంత అద్భుతమైన గుణమిస్తున్నది కదా, చిటారుకొమ్మని వున్న ఆ పండు ఎందుకు విషఫల మయిందీ?" అని అడిగాడు.

అందుకు రసార్ణవుడు, "సోమా!—ఆ రహస్యం చెప్పటానికే నిన్నిప్పుడు పిలిచాను. వైద్య మర్మం రెండోవాడికి తెలియనివ్వ కూడదు. అందుకనే అ పండు 'విషఫలం' అని అందరితో చెబుతూ వస్తున్నా. కాని, నిజానికి అది అమృత ఫలం. అది తిన్నవాళ్ళకి అమరత్వమే సిద్ధిస్తుంది. వాళ్లు దేవతలతో సమాన మవుతారు. దీన్ని గుట్టుగా వుంచు సుమా. నాకు కాలం సమీపిస్తున్నది. అందుకే దీన్ని నీకు వెల్లడి చేశాను," అని చెప్పాడు.

ఈ మాటలు వినగానే సోమదత్తుడు, "నాన్నగారూ!—ఎంత చక్కటి అవకాశం!



కాలం సమీపించిందని మీ రెందుకు బెంగ పెట్టుకుంటారు? కష్టపడి సంపాదించుకున్న ఆ ఫలం మీరే తిని, ఎందుకు అమరత్వం పొందకూడదూ? వరప్రసాదంగా వచ్చిన ఈ అపరూప ఫలం ఇతరు లెవళ్ళకో ఇవ్వడ మేమిటి?" అని ఆత్రంగా అడిగాడు.

అందుకు తండ్రి, "కుమారా, చెప్పేది శ్రద్ధగా విను: బ్రహ్మ పోసిన ఆయుష్షు తీరి పోగానే జీవులందరూ ఈలోకం వదిలి పోవలిసిందే. మానవుడు అమరత్వం పొంద టానికి ప్రయత్నించటం దైవాజ్ఞను ధిక్క రించడ మవుతుంది. అది అలా వుంచి— ఇప్పుడీ ఫలాన్ని గురించిన కీలకాలివి రెండు నువ్వు తెలుసుకోవాలి: లోకోపకారం కోసం వాడినప్పుడే ఆ ఫలం మహత్తుకాని, దాన్ని సంపాదించిన నేను స్వార్థంకోసం ఉపయో గించకూడదు. రెండోది—ఆ ఫలం కోసి వేస్తే, అసలు మొత్తం చెట్టు మహిమే పోతుంది. పండు చెట్టుని వున్నంత కాలమే ఆకుల గుణం, జ్ఞాపకముంచుకో!" అన్నాడు.

ఇలా చెప్పి, రసార్ణవుడు కన్నుమూశాడు. తండ్రి ఆజ్ఞ ననుసరించి సోమదత్తుడు చెట్టు రహస్యం గుట్టుగా వుంచి, వైద్యం చేసు కొంటూ, కాలక్షేపం చేస్తున్నాడు. తండ్రి చెప్పినట్టే, ఆ చిటారుకొమ్మని వుండేది విష




ఫలం అని అడిగిన వాళ్ళందరితో చెబుతూ ఉండేవాడు.

* * *

సోమదత్తుడి ఖ్యాతి దేశదేశాలకు పాకి పోయి, చివరకు కౌశేయపురాన్ని పాలించే గుణవర్మ చెవిని బడింది. గుణవర్మ చాలా కాలంగా తీవ్రమైన కడుపు నొప్పితో బాధ పడుతున్నాడు. ఎటువంటి ఘనవైద్యులూ ఏమీ చేయలేకపోయారు.

అందుచేత సోమదత్తుణ్ణి గురించి విన గానే, గుణవర్మ మంత్రి సామంతాది పరి వారంతో వైద్యుడుండే ఉత్తర ప్రదేశానికి బయల్దేరాడు. గుణవర్మకు ఒక్కగా నొక్క



కొమార్తె, మైథిలి: తండ్రిని విడిచి క్షణం ఎక్కడా ఉండలేదు. కనుక, ఇప్పుడు తండ్రి వెంట వస్తానని పట్టుపట్టింది. కాదన లేక గుణవర్మ సరే రమ్మన్నాడు.

ప్రత్యేకించి తోటలో వేసిన డేరాలలో గుణవర్మ బసచేసి, వైద్యుడికి కబురు చేశాడు. గుణవర్మను గురించిన భోగట్టా అంతా సోమదత్తుడికి ఇంతకుముందే తెలుసు. కనుక, రాజుగారి పిలుపు వచ్చిందనగానే స్వార్థపిశాచి పట్టుకుంది. ఎప్పుడెవరు పిలిచినా మూలికా పత్రాలు చేత పట్టుకువెళ్ళే సోమదత్తుడు ఇప్పుడు రాజ దర్శనానికి ఉత్తచేతులతో వచ్చాడు.

గుణవర్మ వైద్యుణ్ణి ఎంతో గౌరవించి, తన బాధ నయంచేస్తే కోరిన బహుమతి ఇస్తానన్నాడు. రాజు నోటి నుంచి ఈ మాట ఎప్పుడు వస్తుందా అనే సోమదత్తుడు కని పెట్టుకుని వున్నాడు. "మీ వ్యాధి నయం చేయడమనేది పెద్ద విషయంకాదు, నాకు. కుదిరిస్తే, మీ మాట నిలబెట్టుకుంటారా?" అని రెట్టించాడు సోమదత్తుడు.

"మా మాటకు తిరుగు లేదు. కోరుకున్న బహుమతి ఇస్తాం," అంటూ రాజు స్పష్టంగా వాగ్దానం చేశాడు. ఈ వూత తీసుకుని సోమ దత్తుడు, "అయితే, మీ అమ్మాయిని నాకిచ్చి పెళ్ళిచేయాలి," అన్నాడు, తడుముకోకుండా.

రాజు తబ్బిబ్బయిపోయాడు. వైద్యుడు ఇటువంటి కోరిక కోరతాడని కలలోనూ అనుకోలేదు. చూడబోతే సోమదత్తుడు నల్లటివాడు, నడివయసు మళ్ళినవాడు, పైగా అనాకారి. అప్పుడు గుణవర్మ "వైద్య ప్రవీణా!—నీ కోరిక తీర్చటానికి సాధ్యం కాదు. ఈ బాధతోనే చచ్చిపోతాను గాని, నా కుమార్తె జీవితం నాశనం చెయ్యలేను," అని కచ్చితంగా చెప్పాడు.

అందుకు సోమదత్తుడు "రాజా!—ఏళ్ల తరబడి యాతన అనుభవిస్తున్నారు. గంట

సేపట్లో, మంత్రించి నట్టుగా మీ వ్యాధి తీసి పారవేస్తాను. సుఖంగా వుంటారు. బాగా ఆలోచించుకుని కబురు చేయండి," అని చెప్పి వెళ్ళిపోయాడు.

వైద్యుడు వెళ్ళగానే రాజపుత్రి తండ్రి వద్దకు వచ్చి, "నాయనా! మీ బాధ నేను చూడలేకుండా వున్నాను. నే సతన్నే పెళ్ళాడతానని కబురు పంపండి. అయితే, ఒక్క షరతు పెట్టండి: ఆయన చెప్పినట్టూ ఒక్క గంటకల్లా బాధ తగ్గకపోతే మన కోటగుమ్మానికి తల వప్పగించాలని మాత్రం చెప్పండి," అన్నది.



ఆ సాయంత్ర మంత్రి వైద్యుడింటికి వచ్చి, రాజకుమార్తె మాటలు పూసగుచ్చి నట్టు చెప్పాడు. అంతా విని సోమదత్తుడు, "మంత్రివర్యా!–మాటవరసకు గంటసేపు గడువిమ్మన్నాను గాని, అదీ అవసరం లేదు. రాజాజ్ఞ అయితే, రెండే నిమిషాల్లో ఏలిన వారి బాధ పోగొడతాను. పోగొట్ట లేకపోతే, సంతోషంతో నా తల సమర్పిస్తాను," అంటూ, నిబ్బరంగానూ నిర్లక్ష్యంగానూ చెప్పాడు. చాటుగా పక్కనే వుండి, సోమదత్తుడి భార్య సుపర్ణ ఈ ప్రసంగమంతా విన్నది. రాజుగారి కూతురే తన భర్తకు రాణి కాబోతున్నది! ఇక తన ముఖం చూస్తాడా? తన గతియేమిటి? ఇదెంత దారుణమైన ఆలోచన?–ఇలా ఆమె మనస్సులో తీరని వేదన పొందుతూవుంది. కాబోయే కల్యాణం గురించి సోమదత్తుడు సంతోషంతో పొంగి పోతున్నాడే కాని, భార్య బాధపడుతుందేమో అని తలచనే లేదు.

చీకటితోనే లేచి, ఆకులు కోసుకుని, సోమదత్తుడు రాజుగారి బసకు బయల్దేరాడు. రాజుకు మందిచ్చాడు. ఎందుచేతనో, తగ్గటానికి బదులు రాజు బాధ ఎక్కువై, భరించ లేక పోయాడు. వైద్యుడికి చెమటలు పోశాయి. "వైద్యశేఖరా!–తల యివ్వటానికి సిద్ధంగా ఉండు!" అన్నాడు, మంత్రి.

"స్వామీ!—తొందరలో ఏదో పొరపాటు జరిగింది. మరొక మూలిక తెచ్చివుంటాను. సెలవిస్తే, ఇంటికి పోయి, ఇప్పుడే సరైన మందు తెస్తాను," అన్నాడు, వణికిపోతూ సోమదత్తుడు.

రాజాజ్ఞ అయింది కనక, సోమదత్తుణ్ణి మంత్రి సరే పోయి రమ్మన్నాడు. అయితే, అతడు మోసం చెయ్యకుండా, చెరివక పక్కనీ విచ్చుకత్తులతో ఫారావాళ్ళని వెంట పంపించాడు.

ఇంటికి వస్తూనే సోమదత్తుడు ఫెరట్లోకి వెళ్ళి, చెట్టు చిటారు కొమ్మ చూశాడు. అక్కడ పండు కనిపించ లేదు. "అంతా నిష్ప్రయోజనం!" అనుకొంటూ, లోపలికి వస్తూంటే కాలికి ఒక కాగితం తగిలింది. అందులో—

"మీకు నేను ఆటంకంగా ఉండ దలచ లేదు. చెట్టుపైన వున్న విషఫలం తిని ఆత్మ హత్య చేసుకొంటున్నాను," అని వుంది.

ఆత్రంతో సోమదత్తుడు భార్యకోసం వెతకసాగాడు. ఎంత వెతికినా ఆమె కన బడలేదు!

* * *

చెప్పలేని బాధతో రాజు మాటాడలేని స్థితిలో వున్నాడు. మంత్రి సోమదత్తుణ్ణి రాజు ఎదట పెట్టి, పక్కనే వున్న భటులకు సంజ్ఞచేశాడు.

అంతలో అశరీరవాణి పలికింది. అందరూ ఆ దిక్కుకి చూసి, ఆశ్చర్య పడ్డారు. ఒక దేవత కనబడి,—

"నా భర్త తప్పు మన్నించండి!" అంటూ, ఆమె తన కథ పూర్తిగా చెప్పింది. తరువాత రాజును పుచ్చుకోమని చెప్పి, ఒక మూలిక కింద పడవేసింది. అది గుటక వేయగానే రాజు బాధ పూర్తిగా తగ్గిపోయి, ఆ క్షణం నుంచీ సుఖంగా వున్నాడు. సిగ్గు తోనూ, విచారంతోనూ సోమదత్తుడు ఇంటికి మళ్ళాడు.






# బాలకాండ

ఒకనాడు నారదమహాముని తమసా నదీ తీరాన గల వాల్మీకి మహాముని ఆశ్రమానికి వచ్చాడు. వాల్మీకి ఆయనను శాస్త్రోక్తంగా పూజించి, "మహాత్మా, ఈ యుగంలో ఈ లోకంలో సకల సద్గుణసంపన్నుడూ, మహా పరాక్రముడూ అయిన పురుషుడు ఎవడైనా ఉన్నాడా?" అని అడిగాడు.

అప్పుడు వాల్మీకికి నారదమహాముని రాముడి కథ సవిస్తరంగా చెప్పాడు. నారద మహాముని సెలవు తీసుకుని వెళ్ళిపోయేసరికి మధ్యాహ్న స్నానానికి వేళఅయింది. వాల్మీకి మహాముని తన శిష్యుడైన భరద్వాజుణ్ణి వెంటబెట్టుకుని తమసా నదీతీరానికి వెళ్ళాడు.

అక్కడ ఆయనకు ఒక క్రౌంచపక్షుల జంట కనిపించింది. ఆ పక్షులు పరస్పర ప్రేమలో మైమరచి తియ్యగా పాడుతూ, అరణ్యంలో ఎగురుతూ ఆనందిస్తున్నాయి.

నార బట్టకట్టుకుని నీటిలోకి దిగబోతూ వాల్మీకి ఆ పక్షుల ఆనందోత్సాహన్ని చూస్తున్నంతలో ఒక బోయవాడు బాణంతో మగ పక్షిని కొట్టాడు. అది కిందపడి గిలగిలా తన్నుకున్నది. ఆడపక్షి ఆర్తనాదాలు చేసింది.

వాల్మీకి హృదయంలో ఆ పక్షిపైన జాలి, కిరాతుడిపైన ఆగ్రహమూ తన్నుకుని వచ్చాయి. వెంటనే ఆయన బోయవాడితో ఇలా అన్నాడు:

"మానిషాద ప్రతిష్ఠాంత్వ
మగమ శ్శాశ్వతీ స్సమాః,
యత్క్రౌంచ మిధునాదేక
మవధీః కామమోహితం."



"ఓరి కటికవాడా, ప్రేమోద్రేకంలో ఉన్న క్రౌంచపక్షుల జంటలో ఒకదాన్ని చంపిన నువ్వు చిరకాలం బాగా ఉండలేవు," అనే అభిప్రాయం అప్రయత్నంగా వాల్మీకి నోట శ్లోకం రూపంలో వెలువడింది. ఆ శ్లోకానికి నాలుగు పాదాలూ, ఒక్కొక్క పాదంలోనూ ఎనిమిదేసి అక్షరాలూ ఉన్నాయి.

తన నోట ఇలా శ్లోకం వెలువడటం చూసి వాల్మీకే విస్మయం చెందాడు. ఇక ఆయన శిష్యుడైన భరద్వాజుడి ఉత్సాహానికి అంతే లేదు. అతను తన గురువు నోటి మాటలను పదేపదే పఠించి శ్లోకాన్ని కంఠస్థం చేశాడు.



తరవాత వాల్మీకి స్నానం చేసి కాల కృత్యాలు తీర్చుకుని ఆశ్రమానికి వెళ్ళాడు. భరద్వాజుడు జల కలశం తీసుకుని ఆయన వెంబడే వెళ్ళాడు. ఆశ్రమంలో కూడా వాల్మీకి తన నోట వెలువడిన శ్లోకం గురించే ఆలోచిస్తూ ఉండిపోయాడు.

అంతలో బ్రహ్మదేవుడు ఆయనను చూడ వచ్చాడు. వాల్మీకి చప్పున లేచి బ్రహ్మకు సాష్టాంగం చేసి, అర్ఘ్యపాద్యా లిచ్చి, స్తోత్రాలతో సన్నుతించి మౌనంగా నిలబడ్డాడు. అప్పుడు బ్రహ్మ వాల్మీకిని కూచోమని, "వాల్మీకీ, నా అనుగ్రహంచేతనే నీకు కవిత్వం అబ్బింది. నీవు ఇంతకు ముందే రాముడి కథ విన్నావుగదా. ఆ కథను మహా కావ్యంగా రచించు. అది భూమి ఉన్నంత కాలమూ నిలిచి ఉంటుంది. అది ఉన్నంత కాలమూ నీవు ఉత్తమ లోకాలలో సంచరించ గలిగి ఉంటావు," అని చెప్పి అంతర్ధానమైనాడు.

ఈ విధంగా బ్రహ్మయొక్క ప్రోత్సాహంతో వాల్మీకి రామాయణ కథను, తన నోట అప్రయత్నంగా వెలువడిన శ్లోకాలలాటి శ్లోకాలతో, అందరికీ ఆనందం కలిగించే విధంగా రచించాడు. ఆ కథనే మనంకూడా చదివి ఆనందించుదాం.



వైవస్వతుడు సూర్యుడి కొడుకు. ఇక్ష్వాకు అనేవాడు వైవస్వతుడి కొడుకు. వైవస్వతుడు ఏడవ మనువు అయి శాశ్వత కీర్తి సంపాదించాడు. ఆయన అనంతరం ఇక్ష్వాకు సంతతివారు ఇక్ష్వాకులనీ, సూర్యవంశం వారనీ పిలవబడి ప్రసిద్ధి కెక్కారు. వీరిలో సగరుడుకూడా ఒకడు. ఈ సగరుడు షట్చ్రక్రవర్తులలో ఒకడు. గంగను స్వర్గం నుంచి భూమికి తెచ్చిన భగీరథుడు ఈ సగరుడికి మనమడే.

సూర్యవంశపు రాజులు అయోధ్యా నగరం రాజధానిగా కోసలదేశాన్ని పాలించారు. అయోధ్యను వైవస్వత మనువు స్వయంగా నిర్మించాడు. అది పన్నెండు ఆమడలు పొడుగూ, మూడు ఆమడలు వెడల్పూ గల చక్కని నగరం. దాని చుట్టూ ప్రాకారమూ, లోతైన అగడ్తలూ ఉండేవి. నగరంలో లక్ష్మి తాండవించేది. అక్కడి ప్రజలలో శిల్పులూ, కళాకారులూ, పండితులూ, యుద్ధవిద్యలో ఆరితేరినవారూ వేదవేదాంగాలు తెలిసినవారూ ఉండేవారు. పట్టణంలో ఏనుగులూ, మేలుజాతికి చెందిన దుర్రాలూ, గోవులూ, ఒంటెలూ, గాడిదలూ దండిగా ఉండేవి. ప్రజల జీవితం సుఖమయంగా ఉండేది.



శత్రువులకు దుర్భేద్యమైన ఈ అయోధ్యను సూర్యవంశపు రాజైన దశరథుడు పరిపాలిస్తూ ఉండేవాడు. దశరథుడు ఐశ్వర్యంలో ఇంద్ర కుబేరులకు తీసిపోనివాడు, మహాపరాక్రమ సంపన్నుడు.

దృష్టి, జయంతుడు, విజయుడు, సిద్ధార్థుడు, అర్థసాధకుడు, అశోకుడు, మంత్రపాలుడు, సుమంత్రుడూ అనే ఎనిమిది మందీ దశరథుడి మంత్రులు. వసిష్ఠ మహాముని ఆయనకు కులగురువు. వసిష్ఠుడూ, వామదేవుడూ ఆయన పురోహితులు. వేగుల వాళ్లద్వారా దేశంలో ఏమూల ఏమి జరుగుతున్నదీ తెలుసుకుంటూ, తన మంత్రుల

సహాయంతో దశరథుడు న్యాయంగా రాజ్య పాలన చేస్తూవచ్చాడు.

దశరథుడికి ఏలోటూ లేదుగాని సంతానం లేని లోటు ఉండి, అయనను బాధించేది. ఒకనాడాయన అశ్వమేధయాగం చేసి దేవతలను మెప్పించి, వారి అనుగ్రహంతో సంతానం పొందుదామని ఆలోచించి, తన మంత్రులలో అగ్రగణ్యుడైన సుమంత్రుడి ద్వారా వసిష్ఠవామదేవులనూ, సుయజ్ఞుడు, జాబాలి మొదలైన గురువులనూ, ఇతర బ్రాహ్మణ శ్రేష్ఠులనూ పిలిపించి, వారి సలహా అడిగాడు. అశ్వమేధయాగం చేసే ఆలోచనను వారు మెచ్చుకున్నారు.

వారందరూ వెళ్ళినాక దశరథుడితో సుమంత్రుడు, "మహారాజా, మీరు తలపెట్టిన అశ్వమేధయాగాన్ని జరిపించటానికి ఋశ్యశృంగుణ్ణి మించినవాడు లేడు. అతని వృత్తాంతం చెబుతాను వినండి," అంటూ ఈ కథ చెప్పాడు:

అంగదేశాన్ని పరిపాలించే రోమపాదుడు దశరథుడి మిత్రులలో ఒకడు. రోమపాదుడు అన్యాయంగా పరిపాలించటంచేత అంగ దేశంలో భయంకరమైన కరువు సాగింది. రోమపాదుడు ఈ కరువు చూసి దిగులు చెంది, బ్రాహ్మణులను పిలిపించి, కరువు తొలగిపోయే ఉపాయం చెప్పమన్నాడు.



"మహారాజా, విభండకమునికి ఋశ్యశృంగుడనే కుమారుడున్నాడు. అతను ఉండేచోట కరువు ఉండదు. ఎలాగైనా అతనిని అంగదేశానికి రప్పించి, సకల మర్యాదలూ జరిపి, తమ కుమార్తె అయిన శాంతనిచ్చి పెళ్ళిచేసి, అంగదేశంలోనే ఉంచుకున్నట్టయితే, కరువు కాటకాలు పోయి దేశం సుభిక్షంగా ఉంటుంది," అని బ్రాహ్మణులు చెప్పారు.

అప్పుడు రోమపాదుడు తన పురోహితుణ్ణీ, మంత్రులనూ పిలిచి, "మీరు వెళ్ళి ఋశ్యశృంగ మహామునిని ఇక్కడికి తీసుకు రండి," అని ఆజ్ఞాపించాడు.

ఈ మాట విని పురోహితుడూ, మంత్రులూ భయపడ్డారు. ఎందుకంటే ఋశ్యశృంగుడు సులువుగా అరణ్యాలనూ, తన తపస్సునూ మాని, ఎవరో పిలవగానే వచ్చే మనిషికాడు. ఆగ్రహించి శపించినా శపించగలడు. అతన్ని రప్పించాలంటే ఏదో ఒక మాయోపాయం పన్నాలి.

ఆ ఉపాయాన్ని రోమపాదుడికి పురోహితుడు ఈవిధంగా చెప్పాడు:

"మహారాజా, ఋశ్యశృంగుడు పసితనం నుంచీ అరణ్యంలోనే ఉండి వేదాధ్యయనంలోనూ, తపశ్చర్యలోనూ జీవితం గడిపినవాడు. అతనికి ఆడవాళ్ళు ఎలా ఉంటారో







అతను ఎందుకో ఆశ్రమందాటి వచ్చాడు. వెంటనే వేశ్యలు పాటలు పాడుతూ అతన్ని సమీపించారు. వారి అందమైన ఆకారాలూ, అలంకరణలూ, పాటలూ, శ్రావ్యమైన గొంతులూ విని ఋశ్యశృంగుడు ఆశ్చర్య పోయి ఆకర్షించబడ్డాడు. కాని వారు స్త్రీలని కూడా అతనికి తెలియదు.

వేశ్యలు అతన్ని సమీపించి, "ఓ బ్రాహ్మడా, నీ పేరు? ఎందుకీ అరణ్యంలో ఒంటరిగా తిరుగుతున్నావు?" అని అడిగారు.

"నేను విభండక మహాముని కొడుకును. అదే మా ఆశ్రమం. మీరు ఆశ్రమానికి వచ్చినట్టయితే మీకు విధ్యుక్తంగా పూజ చేస్తాను," అన్నాడు. వారు అతని వెంట ఆశ్రమానికి వెళ్ళి, అతనిచ్చిన కంద మూలాలూ, ఫలాలూ తిన్నారు. అక్కడ ఎక్కువసేపు ఉంటే విభండకుడు శపిస్తా డని భయపడి వేశ్యలు వెళ్ళిపోతూ అతనికి తమ వెంట తెచ్చిన భక్ష్యాలిచ్చి, "ఇవి మా పళ్ళు. వీటినికూడా రుచిచూడు! ఇక మేము వెళ్ళి తపస్సు చేసుకోవాలి," అంటూ ఋశ్యశృంగుణ్ణి ఆలింగనం చేసు కుని ఆశ్రమందాటి వెళ్ళిపోయారు.

ఋశ్యశృంగుడు వారు పెట్టిన భక్ష్యాలు తిని అవీ పళ్ళే అనుకున్నాడు. అయితే

కూడా తెలియదు. మనం కొంతమందిది వేశ్య లను అలంకరించి, పూలుపెట్టి, సుగంధాలు వెదజల్లేలాగా తయారుచేసి పంపినట్టయితే వారు సులువుగా ఋశ్యశృంగుణ్ణి ఆకర్షించి తమవెంట తీసుకురాగలుగుతారు."

రోమపాదు డిందుకు సమ్మతించి కొందరు వేశ్యలను చక్కగా అలంకరింపజేసి ఋశ్య శృంగుడి ఆశ్రమానికి పంపాడు. వారు ఆశ్రమం వెలపల ఉండి ఋశ్యశృంగుడు ఎప్పుడు కనిపిస్తాడా అని వేచి ఉన్నారు.

ఆ ఋశ్యశృంగుడు ఎప్పుడూ తండ్రికి శుశ్రూషలు చేస్తూ ఎన్నడూ ఆశ్రమందాటి వెళ్ళేవాడు కాడు. అలాటిది ఒకనాడు



అవి తాను తినే పళ్ళకంటె చాలా రుచిగా ఉన్నాయి. అలాగే తన అతిథ్యం స్వీకరించిన వారు మామూలు మునులకంటె చాలా అందంగా ఉన్నారు. అతను వారిని మరవలేక ఆ రోజల్లా వికలమైన మనస్సుతో గడిపాడు. మర్నాడు, వారు కనిపించవచ్చునన్న ఆశతో, కిందటిరోజు వారు కనిపించిన చోటికే వెళ్ళాడు.

అతన్ని చూడగానే వేశ్యలు తమ పని నెరవేరిం దనుకున్నారు. వారు అతనితో, "అయ్యా, నీవుకూడా మా ఆశ్రమానికి రా. అక్కడ నీకు చక్కగా మర్యాద చేస్తాము," అన్నారు.

ఋశ్యశృంగుడు అందుకు పరమానందంతో సమ్మతించి, ఆశ్రమం విడిచి వారి వెంట బయలుదేరాడు.

ఋశ్యశృంగుడి వెంటనే అంగదేశానికి వర్షంకూడా వచ్చింది. రోమపాదుడు ఋశ్యశృంగుడికి ఎదురు వచ్చి, సాష్టాంగపడి మొక్కి, తాను అతనిని ఈవిధంగా రప్పించినందుకు క్షమాపణ చెప్పుకుని, తన కూతురైన శాంత నిచ్చి శాస్త్రోక్తంగా పెళ్ళిచేశాడు. ఋశ్యశృంగుడు శాంతతోకూడా సమస్త సుఖాలూ అనుభవిస్తూ అంగదేశంలోనే ఉండిపోయాడు.

సుమంత్రుడు చెప్పిన ఈ కథ విని దశరథుడు ఎంతో సంతోషించి, వసిష్ఠమహాముని అనుమతి పొంది, తన భార్యలనూ, మంత్రులనూ వెంటపెట్టుకుని అంగదేశం వెళ్ళాడు. రోమపాదుడు దశరథుడికి గొప్పగా ఆతిథ్యం ఇచ్చి తన యింట వారం రోజు లుంచుకుని, ఆయన వచ్చిన పని తెలుసుకుని, తన అల్లుడైన ఋశ్యశృంగుణ్ణీ, తన కుమార్తె అయిన శాంతనూ దశరథుడి వెంట పంపటానికి ఒప్పుకున్నాడు. వెంటనే దశరథుడి దూతలు, అయోధ్యా నగరాన్ని అలంకరించే ఏర్పాట్లు చేయించటానికి ముందుగా బయలుదేరి వచ్చేశారు.






పౌర్ణమివెన్నట్లో తాతయ్య అప్పుడే భోజనం చేసి వచ్చి తన మామూలు వాలు కుర్చీలో కూచున్నాడు. పిల్లలు అంతకుముందే చేరి, తాతయ్యకోసం ఎదురు చూస్తున్నారు. తాతయ్య పొడుంకాయి తీసి, పొడుం పేనుకుంటూ ఒక శ్లోకం చదివాడు:

"అజ్ఞా ఏవ జనాః ప్రాయో
వంచ్యంతే వంచకైః నృభిః
ప్రాజ్ఞా నజాతు వంచ్యంతే
సుమతి శ్చోలరాడివ."

"అంటే ఏమిటి, తాతయ్యా?...ఇది ఇంకో కథా, తాతయ్యా?...కథ చెబుతావా, తాతయ్యా?" అని పిల్లలు గొడవచేశారు.

తాతయ్య తాపీగా పొడుం పట్టుపట్టి పీల్చి, "కథ చెప్పటానికేగదర్రా, శ్లోకం చదివింది? ముందు శ్లోకం అర్థం ఏమిటని అడగరేం? సాధారణంగా లోకంలో ఎందరో మోసగాళ్ళుంటారుగద. వాళ్ళు మోసం చేసేది ఎవర్ని? తెలియని అమాయకు లను! అవునా? అయితే ఒక్కొక్కసారి తెలివి గలవాళ్ళు ఈ మోసంచేసేవాళ్ళనే మోసం చేస్తూంటారు. వెనకటికి చోళదేశపు రాజైన సుమతి అనేవాడు ఇలాగే మోసగాణ్ణి మోసం చేశాడూ అని శ్లోకం అర్థం," అన్నాడు తాతయ్య.

"సుమతి ఎవర్ని మోసం చేశాడు, తాతయ్యా? మోసగాడెవరు, తాతయ్యా?" అని పిల్లలు తలా ఒక ప్రశ్నా వేశారు.

"నన్ను చెప్పనివ్వండర్రా!" అంటూ తాతయ్య ఈ కథ చెప్పాడు.

చోళదేశాన్ని సుమతి అనే రాజు పాలించే వాడు. సుమతి అంటే చాలా తెలివిగలవా డన్నమాటగద. ఆ రాజు నిజంగా తెలివి గలవాడేనూ! అంతేకాక ఆయన గొప్ప వీరుడు, గొప్ప విద్వాంసుడు, అంతులేని దానధర్మాలు చేశాడు.

తాతయ్య కథలు:—9

రచన: సి. శేషాద్రి

ఒకనాడు సుమతి కొలువుదీరి ఉండగా ఒకడు వచ్చి రాజుగారికి వందనంచేశాడు. "ఏమయ్యా, నీవు ఏ విద్యలో ప్రవీణు డివి?" అని రాజు అడిగాడు.

"మహారాజా, నేను రసవేదిని. ఏ లోహ న్నయినాసరే బంగారంగా మార్చే విద్య నాకు తెలుసు. అది మా కులవిద్య," అన్నాడు ఆ వచ్చినవాడు.

ఇటువంటి మోసగాళ్ళు రసవేదులమని చెప్పుకు తిరుగుతూ, జనాన్ని మోసగించి వెండి మొదలైన లోహాలను దొంగిలించి పారిపోతూ ఉండేవాళ్ళు.

రాజు బుద్ధిశాలి గనక ఈ విషయం తెలుసుకున్నాడు. వాడికి పరాభవం చెయ్యా లనికూడా ఆయన నిశ్చయించుకున్నాడు. అందుచేత ఆయన నౌకరును పిలిచి వాడితో రహస్యంగా ఏదో చెప్పాడు. ఆ నౌకరు ఏంచేశాడూ? అవతలికి వెళ్లి ఒక ఇనప్పెట్టె పట్టించుకొచ్చి ఈ మోసగాడికి ఇచ్చాడు.

మోసగాడు తన ఎత్తు పారిందనుకుని సంతోషించాడు. ఆ ఇనప్పెట్టెనిండా వెండీ, బంగారమూ, రత్నాలూపెట్టి రాజుగారు తనకు ఇప్పించారనుకున్నాడో ఏమో మరి! వాడు ఆశగా ఇనప్పెట్టె తెరచి చూసేసరికి అందులో ఏమీ లేదు. పట్టి ఖాళీపెట్టె!

వాడు రాజుగారితో, "మహారాజా, తమరు నాకేదో ఘనమైన బహుమానం ఇప్పిస్తారని గంపెడాశతో వస్తే నాకీ పనికిమాలినఖాళీ ఇనప్పెట్టె దయచేయించి అవమానించటం న్యాయమా?" అన్నాడు.

రాజుగారు, "అదేమిటోయ్? రసవిద్య నీకు కులవిద్య అంటివి. ఏలోహాన్నయినా బంగారం చెయ్యగలనంటివి. ఇక నేను నీకు ఇవ్వగలిగిన దేముందీ? నువు తయారుచేసే బంగారం దాచుకోవటానికి ఉంటుందిగదా అని ఇనప్పెట్టె ఇప్పించాను. ఇందులో అన్యాయమేముందీ?" అన్నాడు. అందరూ గొల్లున నవ్వారు.





# చీకటి భూతం

హిమాలయాలలో ఒకానొక చోట ఒక అడవి మనుషుల జాతి నివసిస్తూ ఉండేది. వాళ్ళు నిప్పు చెయ్యటంగాని, వాడటంగాని తెలియనంత అనాగరికులు. వారు సూర్యాస్తమయానికి ముందే పడుకుని, సూర్యోదయమయాక లేచి కాలకృత్యాలు ఆరంభించేవారు. అందుచేత వారికి చీకటి అంటే ఏమిటో తెలియదు.

ఈ అనాగరికులు నివసించే ప్రాంతానికి సమీపంలో ఒక పెద్ద గుహ ఉండేది. ఈ జాతియొక్క పూర్వీకులు ఒకప్పుడు ఆ గుహలోపల ప్రవేశించారు, కాని వారు అందులో నుంచి తిరిగి రాలేదు. గుహలోపల ఊబిలో దిగబడిపోయో, చీకటిలో తలలు పైన ఉండే రాళ్ళకు కొట్టుకుని పగిలిపోయో వారు గుహలోనే మరణించారు.

కాని ఈ అనాగరిక జాతివాళ్ళు తమ పూర్వీకులు ఆ గుహలోనే ఇంకా ఉంటున్నారని నమ్మి, గుహను ఎంతో పవిత్రంగా చూసేవారు. అయితే ఆ గుహలో ఉండే చీకటిని చూసి, అది ఒక పెద్ద భూతమనుకుని, దాన్ని ఎలాగైనా పారదోలటానికి శాయశక్తులా యత్నాలు చేశారు.

"మనమంతా గుహ ముందు సాష్టాంగపడి భూతాన్ని వెళ్ళిపొమ్మని ప్రార్థిస్తే అదే పోతుంది," అని ఒకరు చెప్పారు. అందరూ గుహముందు సాష్టాంగ పడి ఏళ్ళ తరబడి అంతులేని ప్రార్థనలు చేశారు. కాని గుహ నుంచి చీకటి పోనేలేదు.

ఇంతలో మరొకరు, "ఆయుధాలతో నిర్మూలిస్తేగాని ఈ భూతం పోదు!" అన్నారు. సరేనని అనాగరికులు గుహలోకి బాణాలు కొట్టారు, కర్రలూ, రాళ్ళూ విసిరారు. కాని చీకటి ఎప్పటిలాగే ఉంది.

తరవాత ఇంకొకరు, "ఉపవాసాలు చేద్దాం! అలా చేస్తే ఈ భూతం గుహ విడిచి

స్వామి రామతీర్థ

పోతుంది," అన్నారు. నిజమేననుకుని జాతి వాళ్ళంతా ఉపవాసాలు చేశారు. ఇందువల్ల కూడా కొంచెమైనా ఫలితం కలగలేదు. చీకటిభూతం ఇంకా గుహను అంటి పెట్టుకునే ఉన్నది.

దానాలు చేస్తే భూతం విరగడైపోతుందని ఇంకెవరో సూచించారు. అనాగరికులు తమకున్నదంతా దానాలు చేసేశారు. ప్రార్థనలూ, ప్రతాపమూ, ఉపవాసాలూ ఎంత ఫలించాయో ఈ దానాలుకూడా అంతే ఫలించాయి. చిట్టచివరకు ఆ ప్రాంతానికొక జ్ఞాని వచ్చాడు. అనాగరికులు ఆయనతో తమ సమస్య గురించీ, తమ ప్రయత్నాలు ఫలించక పోవటం గురించీ చెప్పారు.

"ఆ గుహలో ఉన్న భూతాన్ని నేను పోగొడతాను. నేను చెప్పినట్టు చెయ్యండి. ఒక పొడుగైన వాసం తీసుకురండి. దాని చివర గడ్డి చుట్టండి. ఆ గడ్డికి బాగా కొవ్వు పట్టించండి," అన్నాడు జ్ఞాని.

వాళ్ళు ఆయన చెప్పినట్టే చేశారు. తరవాత జ్ఞాని చెకుముకి రాళ్ళు ఒకదాని కొకటి కొట్టి నిప్పు రవ్వలు తెప్పించి, వాటితో వాసం చివర కట్టిన గడ్డిని అంటించి వెలిగించాడు. ఆ వాసాన్ని తీసుకుని గుహ ప్రవేశించి నట్టయితే అందులో ఉన్న భూతం పోతుందన్నాడు.

ఎక్కువమంది అనాగరికులు ఈ మాట నమ్మలేదు. "ఎక్కడినుంచో వచ్చిన ఈ మనిషికి అసలు ఏం తెలుసు? మనం ఈ భూతాన్ని ప్రార్థించాం, చంపటానికి యత్నించాం, ఉపవాసాలూ, దానాలూ చేశాం. ఇన్ని చేసినా పోని భూతం ఈ వాసం చూడగానే పోతుందా?" అన్నారు.

కాని కొద్దిమంది ఆ వాసంతో గుహ ప్రవేశించారు. వారి చేతిలో ఉన్న దివిటీ మూలంగా గుహ అంతా వారికి స్పష్టంగా కనిపించింది. చీకటిభూతం ఎక్కడా కనిపించలేదు!



మన దేశపు అద్భుతాలు:

# బృహదీశ్వరాలయం

తంజావూరు ఒకప్పుడు దాక్షిణాత్య సంస్కృతికి గొప్ప కేంద్రం. 10 - 14 శతాబ్దాల మధ్యకాలంలో ఇది చోళరాజుల రాజధాని. వారిలో ప్రసిద్ధుడైన రాజరాజ చోళుడు తంజావూరులో కట్టించిన బృహదీశ్వరాలయం భారతదేశంలోని ఆలయాలన్నిటిలోకీ మహత్తరమైనదనీ, ఆలయ నిర్మాణంలో తమిళులను మించేవారు ప్రపంచంలో లేరనీ పాశ్చాత్యులు చెప్పుకున్నారు. రాజరాజచోళుడు క్రీస్తుశకం పదకొండవ శతాబ్దం వాడు.

ఈ ఆలయం గర్భగుడిలో పెద్ద లింగమూ, ఆలయం ముందు ఒకే రాతిలో మలిచిన నంది విగ్రహమూ ఉన్నాయి (మన దేశంలో ఇంత కన్న పెద్ద నంది విగ్రహం లేపాక్షి ఆలయంలో మాత్రమే ఉన్నది.)

ఆలయగోపురం ఎత్తు 216 అడుగులు; ఇది చాలా దూరంవరకూ కనిపిస్తుంది. గోపుర శిఖరం కింద అమర్చిన రాయి బరువు 80 టన్నులుంటుందట! ఇంత బరువుగల రాతిని అంత ఎత్తు ఎక్కించటం సాధ్యంకాదు. అందుచేత నాలుగు మైళ్లదూరం నుంచి ఈ ఎత్తుకు ఏటవాలు అమర్చి, దాని పైగా ఈ రాతిని చేర్చారట.

ఆలయంలోని శిల్పాలు కేవలం శివ సంబంధమైనవేగాక, విష్ణు సంబంధమైనవీ, బౌద్ధ సంబంధమైనవీగాకూడా ఉన్నాయి. గుడి లోపలి ఆవరణ శాలూకు గోడలకు మెత్తిన గిలాబ చాటున ఇటీవల అతి సుందరమైన కుడ్య చిత్రాలు బయటపడ్డాయి. ఇవికూడా చోళరాజుల కాలం నాటివే. ఈ కుడ్య చిత్రాలు దక్షిణదేశపు చిత్రకారులు చిత్రించినవే అయినప్పటికీ, అజంతా చిత్తరువులనూ, సింహళంలోని సిగిరియా చిత్తరువులనూ పోలి ఉన్నాయి.



# అట్టచివరి బొమ్మ

ధర్మరాజు జాడ ఎక్కడా కనపడకపోవటం గమనించి, అర్జునుడు భీముణ్ణి సమీపించి, "అన్న ఎక్కడ?" అని అడిగాడు. ఆయన శిబిరానికి వెళ్ళి ఉండవచ్చుననీ, కర్ణుడిచేత బాగా గాయపడ్డాడనీ భీముడు చెప్పాడు.

కృష్ణార్జునులు రథంలో శిబిరానికి వెళ్ళారు. ధర్మరాజు శిబిరంలో ఒంటరిగా పక్కమీద పడుకుని ఉన్నాడు. ఆయన వారిని చూసి సంతోషించి, "ఆ కర్ణుణ్ణి చంపి వచ్చారుగదా! వాడు నా పైకి యుద్ధానికి వచ్చి ఎన్ని అనరాని మాటలన్నాడు; ఎంత అవమానం చేశాడు! అర్జునా, ఆ కర్ణుణ్ణి ఎలా చంపావో అదంతా నాకు వివరంగా చెప్పు!" అని ఆత్రంగా అడిగాడు.

"నీవు కనబడక మనసు వికలమై, నిన్ను చూడవచ్చాను. నేనింకా కర్ణుడితో తలపడలేదు," అని అర్జునుడు సమాధానం చెప్పాడు.

ధర్మరాజుకు కోపం వచ్చింది. "కర్ణున్ని చంపలేక వచ్చావులాగుంది! నిన్ను నమ్ముకుని మేమీ శత్రువులవాత పడ్డాం! 'నేను కర్ణుణ్ణి చంపలేను,' అని నీవు ద్వైతవనంలోనే చెబితే ఇంత దుర్గతి రాకపోను! నీకు తోడు ఆ గాండీవం కూడా దేనికి? కృష్ణుడికిగాని మరొకరికిగాని ఇచ్చెయ్యి!" అన్నాడు ధర్మరాజు.

తన గాండీవాన్ని మరొకరి కివ్వమని ఎవరు అన్నప్పటికీ వాళ్ళను చంపే టట్టు అర్జునుడు రహస్యంగా శపథం చేసుకుని ఉన్నాడు. అందుచేత అతను కత్తి దూసి ధర్మరాజును చంపబోయాడు.

కృష్ణుడు అడ్డుపడి అది అవివేకమని చెప్పాడు. "నా శపథం మాట ఏమిటి?" అని అర్జునుడన్నాడు. "మానవంతులకు అవమానమే చావుకన్న హెచ్చు. అందుచేత మీ అన్నను తూలనాడు," అని కృష్ణుడు సలహా ఇచ్చాడు. ఆ ప్రకారమే అర్జునుడు ధర్మరాజును జూదరి అనీ, తమ కష్టాలన్నిటికీ మూల కారణమనీ నిందించాడు. తన అన్నను నిందించినందుకు అతని మనస్సు క్షోభించింది. అందుచేత అతను ఆ కత్తితోనే ఆత్మహత్య చేసుకోబోయాడు.

కృష్ణుడు మళ్ళీ అడ్డుపడి, "మానధనులకు ఆత్మస్తుతి ఆత్మహత్యతో సమానం. అందుచేత నిన్ను నీవు పొగడుకో. నీ చింత నశిస్తుంది," అని సలహా ఇచ్చాడు. అర్జునుడు తనను తాను పొగడుకున్నాడు. ఆ విధంగా ధర్మరాజుకూ, అర్జునుడికీ మధ్య రాజీ జరిగింది.

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వాఖ్యలు 1961 జూలై సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫొటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ మే నెల 20-వతేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:- చందమామ ఫొటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఇంటికాడ ఆటలు

రెండవ ఫోటో : రేవుకాడ మాటలు

పంపినవారు : జి. ఎం. గాంధీ,

అచ్యుతాపురం, (విశాఖపట్నం జిల్లా)

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# చిత్రకథ





ఒక రోజున దాసూ, వాసూలు తోటలో ఆడుకుంటూ వుండగా, ఒక కొంటె కుర్రాడు, వాళ్ళు చెట్టు కింద పెట్టుకున్న పుస్తకాల సంచిని ఎత్తుకుపోయి, గడ్డి వామిలో దాచాడు. తరవాత వాడు గొర్రెలుకాచే కుర్రవాడి దగ్గిరకు వెళ్ళి; గడ్డి వామిలో ఒక సంచీ వున్నదనీ, దాన్ని ఎత్తుకుపోయి, నీ దగ్గిర అట్టేపెట్టుకోమనీ చెప్పి, దాసూ, వాసూల దగ్గిరకు ఆడుకోవటానికి వచ్చాడు. ఈలోపల 'టైగర్' గడ్డివామి దగ్గిరకు వెళ్ళి పుస్తకాల సంచీ వెనక దాక్కున్నది. గొర్రెల కుర్రాడు సంచీ పట్టుకోగానే, వాడి చేతిని గట్టిగా పట్టుకున్నది. వాడు హడిలిపోతూ పరిగెత్తి, కొంటెకుర్రాడు మోసంచేశాడని, కర్ర తీసుకుని వాడివెంట పడ్డాడు.





Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'


పసుపుపచ్చ
LUX
Yellow


ఆకుపచ్చ
LUX
Green


నీలం
LUX
Blue


లేత గులాబీ
LUX
Pink


'నాలుగు 'వానవెల్లి'
రంగులలో
వచ్చింది-నాలక్స్
...తెలుపులో
కూడా!'
అని ఎమ్.ఎస్.రాజమ్
చెప్పుచున్నది
LTS. 82-X29 TL
హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి



# ప్రశ్నోత్తరాలు

1. వి. కె. రత్న, ఒంగోలు

"సీతా వనవాసం" [మార్చి] కథలో అఖరున లవణాసురుణ్ణి చంపిన శత్రుఘ్నుడు అన్నారు. లవణాసురుడు ఎవరు, చందమామయ్యా?

ఒక రాక్షసుడు. వాడి తండ్రి మధుడు, తల్లి కుంభీనాస. మధుడి వద్ద శివు డిచ్చిన శూలం ఉండేది. ఆ శూలంతో లవణుడు గర్వించి మునులను బాధించాడు. వాణ్ణి శత్రుఘ్నుడు చంపాడు.

2. బి. సాయిప్రభ, సంతనూతలపాడు

అన్నయ్యా, శ్రీరామునకు అక్కవున్నదని "చందమామ" [మార్చి]లో వ్రాసినారు. నిజముగా శ్రీరామునకు అక్క ఉన్నదా?

ఉన్నది. ఆమె పేరు శాంత. ఆమె దశరథునికీ, సురభి అనే గ్రహానికీ పుట్టింది. దశరథుడామెను రోమపాదుడికి పెంపుడిచ్చాడు.

3. ఐ. ఎస్. ఎన్. వి. సూర్యనారాయణ, రాజమండ్రి

అన్నయ్యా, "సీతా వనవాసం" [మార్చి]లో సీతకు కుశ లవులు గంగానదిలో పుట్టిరని వ్రాసినారు. రామాయణంలో అట్లులేదు.

అది భవభూతి కల్పన. సంస్కృత నాటకకారులు పురాణ కథలను తమ ఇష్టం వచ్చినట్టు మార్చి రాశారు.

4. ఎ. ఇందిరాదేవి, విజయవాడ

అన్నయ్యా, "జ్వాలాద్వీపం" తరువాత ఏ సీరియల్ వేస్తారు?

కొత్త సీరియల్ పేరు "రాకాసి లోయ."

5. యాదరాజు సత్తిరాజు, తుని

చందమామా! భాద్రపద శుద్ధ చవితినాడు శ్రీ కృష్ణుడు నిన్ను క్షీరంబున గని నీలాప నిందలపాలైనాడని చదివితిని. కాని పూర్తి పౌర్ణమినాడు కూడ పాలలో చందమామ నా కట్లు కనిపించలేదని నేనంటే నీవేమంటావో!

"నిజం, అల్లుడా!" అంటాను.

6. కె. వి. రాజకుమారి, తాడేపల్లిగూడెం

అన్నయ్యా, "చందమామ" చాలా ముందుగానే తయారవుతుందని అన్నారు. మరి 25 వ తారీఖుకే ఎందుకు అందజేయరు ?

కథలు సిద్ధమైనాక ఎంతోపని ఉంటుంది. కథలకు బొమ్మలు వెయ్యాలి, బ్లాకులు చెయ్యాలి. ఆరుభాషలలో రెండుంబాతికలకల "చందమామ" కాపీలు కొన్ని పేజీలు రెండు రంగుల తోనూ, కొన్ని మూడు రంగులతోనూ ముద్రణకావాలి. అయినా "చందమామ"ను నాలుగు రోజులు ముందుగా వెలువరించటానికే ప్రయత్నం చేస్తున్నాం.

7. జె. విజయకుమారి, యల్లనూరు

"జ్వాలాద్వీపం" శ్రీ దాసరి సుబ్రహ్మణ్యంగారు వ్రాసినదికదా, కథ కింద 'చందమామ' అని ప్రచురించుటకు కారణం ?

వారు "చందమామ" సంపాదకశాఖలో పనిచేస్తున్నవారే కావటంచేత.

8. యమ్. అనసూయ, మాదరపాకం

స్త్రీలుకూడా "చందమామ" కార్యాలయం చూడవలయునని వచ్చిన చూపించెదరా ?

"చందమామ" కార్యాలయాన్ని అనేకమంది స్త్రీలు చూసిపోతూనే ఉన్నారు.

9. షేక్ అహ్మద్, వీరవాసరం

"చందమామ" కొన్న తరవాత ఒక గంటలో అయిపోతూవుంది. నెల గడవటం కష్టంగాయున్నది. ఎలా ?

నెల పొడుగునా "చందమామ" చదవటం తప్ప నీ కింకో పనేలేదా, భాయ్ ?

10. కె. ఏలియా, వేటుకూరు

అన్నయ్యా, ఫొటోవ్యాఖ్యల పోటీ గురించి నేను ఆలోచించి వ్రాస్తుంటే మా అన్న బహుమతి పంపరు అంటున్నాడు. నిజమేనా ?

ఎప్పుడన్నా మీ అన్నకు బహుమతి వస్తే ఎగగొట్టామా ? నిజం తెలుసుకోవాలంటే ఏ నెల బహుమతి పొందిన వారికైనా ఒక రిప్లైకార్డు రాసి తెలుసుకోవచ్చునే!

11. వైలిచేటి మంగయమ్మ, విజయనగరము

కొన్ని విషయాలలో "ఆలస్యం అమృతం విషం" అంటారు, మరికొన్ని విషయాలలో తొందరపాటు పనికిరాదంటారు. ఎందుచేత ?

మంచి కార్యాలు శీఘ్రంగా చెయ్యాలి. అవసరం వచ్చి అఘాయిత్యపుపని చెయ్యవలసి వస్తే బాగా ఆలోచించి మరీ చెయ్యాలి. అదే తేడా.

కార్యసఫలత
నాణ్యత
సొగసు

అన్ని సీలింగు పంకాలకు
జంట
బాల్‌బేరింగులు
సమకూర్చుటవలన
చాలాకాలము
పనిచేయును.

వాయిదా పద్ధతుల మీద గూడా దొరకును.

# ఉషా అత్యధిక అమ్మకములు



నాణ్యతకు
పెట్టింది పేరు.

జే ఇంజనీరింగు వర్క్స్ లిమిటెడ్, కలకత్తా—31.

JE-54-TEL

